శ్రీః

# శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రమ్

(శివోల్లాసవ్యాఖ్యానము - స్ఫూర్తిశ్రీ)




ప్రకాశకులు

**శ్రీమతీ రావి కృష్ణకుమారీ - మోహనరావు దంపతులు**

510, Pride Block, Platinum County,

Opp. Hosanna Mandir, Gorantla

**GUNTUR - 522 034.**

శ్రీః

# శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రమ్

శివోల్లాసవ్యాఖ్యానమ్ - స్ఫూర్తిశ్రీ

ప్రథమముద్రణ : శ్రీవినాయకచవితి 25-08-1998
ద్వితీయముద్రణ : మహాశివరాత్రి - 18-02-2023
ప్రతులు : 200
పుటలు : 148
వెల : అమూల్యము



This book is published with the Financial Assistance of **M. Venkata Ramana and R. Kalyani.**

© **R. Mohan Rao, M.Sc., M.A. (Sanskrit),**
510, Pride Block Platinum County,
Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State
**Cell : 9440115411**

**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Mohan Publications**
**Rajahmundry**



# శ్రీపత్రము

మారేడు చెట్టుకు సంస్కృతమున బిల్వవృక్షమని, శ్రీవృక్షమని పేర్లు. బిల్వ పత్రములతో శివపూజ చేసిన సాధించరానిది లేదని ఈ స్తోత్రము చెప్పుచున్నది. శివున కత్యంత ప్రీతి ప్రదాయకమైనదీ పూజ. శివాలయములలో సర్వదినములందు బిల్వార్చనము శివమంత్రములతో చేసిన సర్వపాపహరమనియు, అఖండపుణ్య ప్రదమనియు శైవగ్రంథములు అభివర్ణించినవి. బిల్వము అమృతోద్భవము. మూడు దళములు గలది. అచ్ఛిద్రమైనవి, కోమలమైనవి పూజకు శ్రేష్ఠములు. ఇటువంటి విశేషములన్నియు ఈ స్తోత్రమున పలుకబడినవి.

తంత్రగ్రంథములలో శివునేకాక మరికొందరు దేవతలను కూడా ఈ పత్రములతో అర్చించు పద్ధతులు చెప్పబడినవి. లక్ష్మీపూజ, స్వప్నేశ్వరీ పూజ వీనితో చేయుట కలదు. బిల్వపత్రములతో హెూమము చేసిన దేవతలు తొందరగా పలుకుదురని మంత్రసాధకుల విశ్వాసము. బిల్వపత్రములతో హెూమము చేసిన సంపదలు వృద్ధి చెందునని **మంత్రమహోదధి** చెప్పినది. బిల్వవృక్షము క్రింద కూర్చుండి జపించిన సిద్ధించు కొన్ని సాధనలు గూర్చి **మేరుతంత్రము** విశదీకరించినది. దేవతలు ఋషులు మహాదేవుని బిల్వదళములతో పూజించి కామ్యసిద్ధి బడసిరని పురాణము లనేకవిధముల వర్ణించినవి. కవిసార్వభౌముడైన శ్రీనాథుడు – వ్యాసుడు శివపూజను బిల్వదళములతో చేసినట్లు ఎంత అందముగా వర్ణించినాడో చూడుడు –

**ఉ. వేదవిభాగము బరిఢవించిన పుణ్యుడు వేడ్కబూన్చె బి**
**ల్వీదళ పూజనంబు గడులెస్సగ గూరిమి శిష్యపంక్తితో**
**నాదిమభిల్లు నిత్యకరుణామృత పూరము జల్లు పుండరీ**
**కోదరభల్లు గృత్త కరి యూధపు మల్లుని గొండయల్లునిన్.**

ఈ బిల్వ అష్టోత్తరశతస్తోత్రము పురాతనమైనది. దీనికి అర్థతాత్పర్యములు

లఘువ్యాఖ్య రచించినవారు సుప్రసిద్ధవిద్వత్కవులు శ్రీ స్ఫూర్తిశ్రీ భాస్కరరావుగారు. సముచితమైన అన్వయముచేసి వీనిని అర్థవంతముగా భక్తపాఠకుల కందించిన వీరి కృషి ప్రశంసాపాత్రము. ప్రాచీనస్తోత్రములకు చాలాచోట్ల అన్వయము కుదరదు. చిరకాలపఠనపాఠనములతో నుండుటచే అలవాటై వాని అర్థమును గురించి ఆలోచించుట ఉండదు. అటువంటి సందర్భములలోనే పండితుల పరిశీలన అవసరమగు చుండును. అనుశ్రుతముగా వచ్చుచున్న ప్రాచీనరచనలను – ముఖ్యముగా పెద్దలు వ్రాసిరని చెప్పబడుచున్న వానిని త్రోసిపుచ్చలేము. ఎటులో సమన్వయము చేయవలసి ఉండును.

ఈ శ్లోకములలో మరీ ఎక్కువ ఇబ్బంది లేదుగాని కొంత తప్పలేదు. అధ్యాహారములు – పూరణములు చేయవలసి వచ్చినది. స్ఫూర్తిశ్రీగారు తమ చాతుర్యముతో సమంచితమైన అన్వయక్రమములు కూర్చినారు. ఈ గ్రంథము భక్తులకత్యంతము ఉపయోగపడగలదని విశ్వసించుచు వ్యాఖ్యాతను హృదయ–పూర్వకముగా అభినందించుచున్నాను.

**– ప్రసాదరాయ కులపతి**





# శ్రీఫలము

అధికపాఠములు, ఫలశ్రుతితో 121 శ్లోకములతో కూడి, “**ఏకబిల్వం శివార్పణమ్**” అనే మకుటంతో విరాజిల్లే ఈ **శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రము**నకు శివోల్లాసమనెడి పేర వ్యాఖ్యానము నందించిన మాననీయుడు స్ఫూర్తిశ్రీ.

**ప్రథమశ్లోకం :**

**శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్ర్యాయుధమ్ ।**
**త్రిజన్మపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥**

బిల్వపత్రమునకు శివునకు భేదమే లేదని చెప్పుచున్నది.

**చివరి శ్లోకము :**

**శ్లో॥ బిల్వాష్టోత్తరశతం స్తోత్రం యః పఠేత్ భక్తిమాన్నరః ।**
**శివలోకమవాప్నోతి శివేన సహమోదతే ॥**

ఈ స్తోత్రమును భక్తియుక్తుడై యే మానవుడు పఠించునో, ఆ మానవుడు శివలోకమును పొంది శివునితో కూడి ఆనందించునని చెప్పుచున్నది.

మారేడు ఫలాన్ని ఒక వామహస్తమున ధరించిన పరశమ్భువును వర్ణించే ఈ శ్లోక విశిష్టతను చూడండి.

**శ్లో॥ కల్పాంతానంతసూర్యద్యుతిమతివికటానేకదంష్ట్రం షడాస్యం**
**వహ్నీందర్కాంబుకాష్ఠాదశయుతమభితః ప్రజ్వలంతమ్మయూఖైః ।**
**శూలాసీషూగ్రశక్త్యంకుశవరనృశిరఃశ్రీఫలేష్వాసవారి–**
**ప్రోతత్పాశాభయాంకైర్నిజభుజపరిఘైస్త్వాం గురుం శమ్భుమీడే ॥**

ఈ శ్లోకము దూర్వాసముని ప్రణీతంబైన, తాంత్రికాద్వైతశైవసిద్ధాంతఛాయలున్న ‘**శ్రీపరశమ్భుమహిమ్నః స్తోత్రమ్**’ లోనిది.

శివుడు పంచముఖుడనియే ప్రసిద్ధము, కాని మహాన్యాసమున ‘**పాతాళ–షష్ఠమ్ముఖమ్**’ అని ఆఱు ముఖములు చెప్పబడినవి. ఇచట శమ్భుడు షణ్ముఖుడని చెప్పుట, శమ్భువుయొక్క పావకత్వమును వ్యక్తీకరించుట జరిగినది. పంచముఖము

లున్నప్పుడు పూర్వపశ్చిమదక్షిణోత్తరోర్ధ్వాభిముఖములైన ముఖములకు, అధోదిశాభిముఖమైన ముఖమును చేర్చినచో శివుని కాఋ ముఖములనుట సబబుగానే యుండును. పరశమ్భువునకు ఇచ్చట పన్నెండు చేతులు, పన్నెండు ఆయుధములు చెప్పబడినవి. శూలము, కత్తి, బాణము, ఉగ్రశక్తి, అంకుశము, వరచిహ్నము దక్షిణ భాగమున నున్న హస్తములందు; పుఱ్ఱె, ధనువు, చక్రము, పాశము, మారేడు కాయ, అభయచిహ్నము వామభాగమున నున్న హస్తము లందున్నవి.



# శ్రీవృక్షము

బిల్వవృక్షము శివస్వరూపము. దీనికి మారేడు అని ప్రాంతీయనామము. రూటేసీ కుటుంబానికి చెందిన దీని శాస్త్రీయనామము ఏగిల్ మర్మిలాస్ (లిన్నెయస్) కరియా. ఆరేడు మీటర్లు ఎత్తు పెరిగే ఈ వృక్షం కొమ్మలకు 2 నుండి 3 అంగుళాల దాకా పొడవుండే ముండ్లు ఉంటాయి. పత్రాలు త్రిదళసంయుక్తము, పుష్పాలు లేత ఆకుపచ్చగా ఉంటాయి. ఫలాలు దీర్ఘగోళాభంగా గాని, గోళాభంగా గాని ఉండి పైన గట్టి పెంకు, లోపల జిగటగా ఉండే గుజ్జుతో కూడి విత్తనాలను కలిగియుంటాయి. ఇది ఆంధ్రప్రదేశ్ అరణ్యాలన్నింటిలోను పెరుగుతుంది. శివునకు అతిప్రీతికరమైనది గావున శివాలయాలలో దీనిని పెంచుదురు. మారేడు ఫలాలు జనవరి ఏప్రిల్ నెలల్లో లభిస్తాయి. వైద్యరీత్యా ఇది దశమూలాలకు చెందినది. వేళ్లు జీర్ణశక్తిని పెంచుతాయి. వాతాన్ని హరిస్తుంది. పండులోని గుజ్జు ఉదరశూలను పోగొడుతుంది. బిల్వపత్రాలను నానవేసిన నీటిని రోజూ తీసుకుంటే మధుమేహ వ్యాధి తగ్గుతుంది. ఆయుర్వేదము, సిద్ధ, యూనానీ వైద్యాలలో దీనిని వాడుతారు.

గృహముల ఆవరణలో పంచబిల్వాలుగా పేరు పొందిన **తులసి – బిల్వము, నిర్గుండీ (వావిలి) – జంబీరము – ఆమలకము** మొక్కలు నాటండి, పెంచండి.

ఈ వృక్షదళాలతో శివపూజ చేయండి. ఆరోగ్యాన్ని సౌభాగ్యాన్ని పొందండి. శివునితో కూడి ఆనందించండి.

**శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రము**తో బాటు ఈ గ్రంథమున **శ్రీశివపంచాక్షరీ మహామంత్రము**నకు జగద్గురు శ్రీ శంకరాచార్యుని శిష్యులైన శ్రీ పద్మపాదా-చార్యులవారి వార్తికమును, **పంచముఖశివధ్యానశ్లోకాలు – మహామంత్రాలు, శ్రీశివ-పంచాక్షరీ స్తోత్రము, పాణిమంత్రము, అర్ధనారీశ్వరస్తోత్రము** ఇందు పొదుగ-బడినాయి.

శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రమునకు – శివోల్లాస వ్యాఖ్యానమందించిన **స్ఫూర్తిశ్రీ గార్కి**, వ్యాఖ్యానం వెలువడుటలో చేయూత నిచ్చి సహాయ సహకారాలందించిన 1. శ్రీనాథుని ప్రణీతంబైన శ్రీభీమేశ్వరపురాణమునకు దక్షిణకాశికా వ్యాఖ్యాన మందించిన **శ్రీ గుండవలి లక్ష్మీనారాయణగార్కి**, 2. ఈ గ్రంథానికి "**శ్రీపత్రము**" నందించిన తాంత్రిక ప్రపంచమున వెలిగే పుష్పమైన **డాక్టర్ ప్రసాదరాయకులపతి గార్కి** నమస్సుమాంజలులు.

ఈ వ్యాఖ్యానగ్రంథాన్ని – దేశములోని అన్ని శివాలయాలవారు యథేచ్ఛగా పునర్ముద్రించుకొనవచ్చును.

**– మోహనరావు.**





శ్రీః

అథ శ్రీమద్భగవత్పాదపద్మపాదాచార్యవిరచితమ్

# శ్రీశివపఞ్చాక్షరీభాష్యమ్

శ్రీగణేశాయ నమః

## ఓం నమశ్శివాయేతి మన్త్రః

### తస్య ప్రథమం వ్యాఖ్యానమ్

శ్లో॥ త్యాగో హి నమసో వాచ్య ఆనన్దః ప్రకృతేస్తథా ।
ఫలం ప్రత్యయవాచ్యం స్యాత్త్యాజ్యం పత్రఫలాదికమ్ ॥ 1

శ్లో॥ త్యజామీదమిదం సర్వం చతుర్ణామిహ సిద్ధయే ।

ఓం నమశ్శివాయ

*అథవా నమసో వాచ్యః ప్రణామో దైన్యలబ్ధయే ॥* 2

శ్లో॥ దైన్యం సేవా తథా జ్ఞప్తిః సిద్ధిస్సర్వస్య వస్తునః ।
నమామి దేవదేవేశం సకామోఽకామ ఏవ వా ॥ 3

ఓం నమశ్శివాయ

శ్లో॥ నఞా నిషిధ్యతే భావవికృతిర్జగదాత్మనః ।
మననం దేవదేవేశ! నేహ నానాస్తి శబ్దతః ॥ 4

శ్లో॥ అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధోఽస్మి నిత్యశః ।
ప్రణామో దేహగేహాదేరభిమానస్య నాశనమ్ ॥ 5

ఓం నమశ్శివాయ

శ్లో॥ శివో బ్రహ్మాదిరూపస్స్యాచ్ఛక్తిభిస్తిసృభిస్సహ ।
అథవా తుర్యమేవ స్యాన్నిర్గుణం బ్రహ్మ తత్పరమ్ ॥ 6

శ్లో॥ నమసో నమనే శక్తిర్నిమనం ధ్యానమేవ చ ।
జేఽన్తాత్తాదాత్మ్యసమ్బన్ధః కథ్యతే ప్రత్యగాత్మనోః ॥ 7

శ్లో॥ అహం శివః శివోఽహఞ్చ మన్యే వేదాన్తనిష్ఠయా ।
ఇత్యేవం నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః ॥ 8

శ్లో॥ అథవా దాస ఏవాహమహం దాస ఇతీరణమ్ ।
ఇత్యేవ నమ ఇత్యుక్తం వేదైశ్శాస్త్రైశ్చ సర్వశః ॥ 9

శ్లో॥ అథవేదమిదం సర్వం త్యజామి పరమాప్తయే ।
అర్థం ధర్మఞ్చ కామఞ్చ వాఞ్ఛంశ్చ జగదీశ్వరమ్ ॥ 10

శ్లో॥ ఏతన్మన్త్రార్థతత్త్వజ్ఞైర్వేదవేదాన్తతత్పరైః ।
నిర్ణీతం తత్త్వగర్భం యద్విజ్ఞేయం ముక్తిలబ్ధయే ॥ 11

శ్లో॥ అథవా ముక్తిలాభాయ ధ్యేయం తత్త్వం వివేకతః ।
భిన్నం బుద్ధ్వా హృదా దేవం మన్త్రేణేశం జగద్గురుమ్ ॥ 12

ఓం నమశ్శివాయ

శ్లో॥ నమేరచి నమః ప్రోక్తో జన్తా స్యాజ్జగదీశ్వరే ।
తస్మాద్దాసోఽహమిత్యేవం మత్వా మాం ప్రాపయాత్మని ॥ 13

ఓం నమశ్శివాయ

శ్లో॥ అస్మిఞ్ఛేతే జగత్సర్వం తన్మయం శబ్దగామి యత్ ।
తద్వానాచ్ఛివ ఇత్యుక్తం కారణం బ్రహ్మతత్పరైః ॥ 14

శ్లో॥ న మా యస్యాస్తి లక్ష్మీశ! సోఽహం దేవ! న సంశయః ।
తస్మాన్మే ప్రాపయేహైవ లక్ష్మీం విద్యాం సనాతనీమ్ ॥ 15

శ్లో॥ యస్మాదానన్దస్వరూపస్త్వం దేవైర్వేదైర్నిగద్యసే ।
తస్మాన్మే దేహి యోగీశ! భద్రం జ్ఞానం సుభావనమ్ ॥ 16

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ యస్మాత్త్వం నేతి నేతీతి నఞర్థం మాఽసి వేదజమ్ ।
తస్మాన్నమోఽసి భద్రం మే యతో జాతోఽనమో నమః ॥ 17

శ్లో॥ శివం శివమథాప్రాప్తః శివాయేతి నిగద్యసే ।
**శివాయ!** మే తథా ప్రాప్త్యా శివాయం కురు సర్వదా ॥ 18

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ శివాం యాతో మహాభద్ర! నమోఽహం మాయయా ధ్రువమ్ ।
తతో నమాయ మహ్యం **మః** శివాయం కురు సర్వథా ॥ 19

**ఓం నమశ్శివాయ**

శ్లో॥ శివమేషి యతో జ్ఞప్త్యా శివాయస్త్వం ప్రపద్యసే ।
న తే మాయా యతో జ్ఞప్త్యా నమో వేదైః ప్రపద్యతే ॥ 20

శ్లో॥ నమోఽహఞ్చ శివాయోఽహం నమో మహ్యం నమో నమః ।
నమో నమాయ శుద్ధాయ మఙ్గళాయ నమో నమః ॥ 21

శ్లో॥ నమో న మసనం శమ్భో! నిరాకారాయ తే నమః ।
నిర్గుణం నిష్క్రియం శాన్తమిత్యాద్యాః శ్రుతయో జగుః ॥ 22

శ్లో॥ నమో బ్రహ్మ నిరాకారం శివాయం శివ! సర్వదా ।
అతోఽహఞ్చ న మా భద్ర! శివాయోఽహం న సంశయః ॥23

ఇతి శ్రీమద్భగవత్పాదపద్మపాదాచార్యవిరచితం
**శ్రీశివపఞ్చాక్షరీభాష్యమ్**
**సమాప్తమ్.**



శ్రీః

# శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రమ్



శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం త్రిణేత్రం చ త్ర్యాయుధమ్ ।
త్రిజన్మపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 1

శ్లో॥ త్రిశాఖైర్బిల్వపత్రైశ్చ హ్యచ్ఛిద్రైః కోమలైః శుభైః ।
తవ పూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 2

శ్లో॥ సర్వత్రైలోక్యకర్తారం సర్వత్రైలోక్యపాలనమ్ ।
సర్వత్రైలోక్యహర్తారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 3

శ్లో॥ నాగాధిరాజవలయం నాగహారేణభూషితమ్ ।
నాగకుణ్డలసంయుక్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 4

శ్లో॥ అక్షమాలాధరం రుద్రం పార్వతీప్రియవల్లభమ్ ।
చన్ద్రశేఖరమీశానమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 5

శ్లో॥ త్రిలోచనం దశభుజం దుర్గాదేహార్ధధారిణమ్ ।
విభూత్యభ్యర్చితం దేవమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 6

శ్లో॥ త్రిశూలధారిణం దేవం నాగాభరణసున్దరమ్ ।
చన్ద్రశేఖరమీశానమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 7

శ్లో॥ గఙ్గాధరామ్బికానాథం ఫణికుణ్డలమణ్డితమ్ ।
కాలకాలం గిరీశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 8

శ్లో॥ శుద్ధస్ఫటికసఙ్కాశం శితికణ్ఠం కృపానిధిమ్ ।
సర్వేశ్వరం సదాశాన్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 9

శ్లో॥ సచ్చిదానన్దరూపం చ పరానన్దమయం శివమ్ ।
వాగీశ్వరం చిదాకాశమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 10

శ్లో॥ శిపివిష్టం సహస్రాక్షం దున్దుభ్యం చ నిషఙ్గిణమ్ ।
హిరణ్యబాహుం సేనాన్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 11

శ్లో॥ అరుణం వామనం తారం వాస్తవ్యం చైవ వాస్తువమ్ ।
జ్యేష్ఠం కనిష్ఠం వైశన్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 12

శ్లో॥ హరికేశం సనన్దీశముచ్చైర్ఘోషం సనాతనమ్ ।
అఘోరరూపకం కుమ్భమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 13

శ్లో॥ పూర్వజావరజం యామ్యం సూక్ష్మతస్కరనాయకమ్ ।
నీలకణ్ఠం జఘన్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 14

శ్లో॥ సురాశ్రయం విషహరం వర్మిణం చ వరూధినమ్ ।
మహాసేనం మహావీరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 15

శ్లో॥ కుమారం కుశలం కూప్యం వదాన్యం చ మహారథమ్ ।
తౌర్యాత్రయం చ దేవం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 16

శ్లో॥ దశకర్ణం లలాటాక్షం పఞ్చవక్త్రం సదాశివమ్ ।
అశేషపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 17

శ్లో॥ నీలకణ్ఠం జగద్వన్ద్యం దీననాథం మహేశ్వరమ్ ।
మహాపాపహరం శమ్భుమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 18

శ్లో॥ చూడామణీకృతవిధుం వలయీకృతవాసుకిమ్ ।
కైలాసనిలయం భీమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 19

శ్లో॥ కర్పూరకున్దధవళం నరకార్ణవతారకమ్ ।
కరుణామృతసిన్ధుం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 20

శ్లో॥ మహాదేవం మహాత్మానం భుజఙ్గాధిపకఙ్కణమ్ ।
మహాపాపహరం దేవమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 21

శ్లో॥ భూతేశం ఖణ్డపరశుం వామదేవం పినాకినమ్ ।
వామే శక్తిధరం శ్రేష్ఠమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 22

శ్లో॥ ఫాలేక్షణం విరూపాక్షం శ్రీకణ్ఠం భక్తవత్సలమ్ ।
నీలలోహితఖట్వాఙ్గమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 23

శ్లో॥ కైలాసవాసినం భీమం కఠోరం త్రిపురాన్తకమ్ ।
వృషాఙ్కం వృషభారూఢమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 24

శ్లో॥ సామప్రియం సర్వమయం భస్మోద్ధూళితవిగ్రహమ్ ।
మృత్యుఞ్జయం లోకనాథమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 25

శ్లో॥ దారిద్ర్యదుఃఖహరణం రవిచన్ద్రానలేక్షణమ్ ।
మృగపాణిం చన్ద్రమౌళిమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 26

శ్లో॥ సర్వలోకభయాకారం సర్వలోకైకసాక్షిణమ్ ।
నిర్మలం నిర్గుణాకారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 27

శ్లో॥ సర్వతత్త్వాత్మకం సామ్బం సర్వతత్త్వవిదూరకమ్ ।
సర్వతత్త్వస్వరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 28

శ్లో॥ సర్వలోకగురుం స్థాణుం సర్వలోకవరప్రదమ్ ।
సర్వలోకైకనేత్రం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 29

శ్లో॥ మన్మథోద్ధరణం శైవం భవభర్గం పరాత్మకమ్ ।
కమలాప్రియపూజ్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 30

శ్లో॥ తేజోమయం మహాభీమముమేశం భస్మలేపనమ్ ।
భవరోగవినాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 31

శ్లో॥ స్వర్గాపవర్గఫలదం రఘునాథవరప్రదమ్ ।
నగరాజసుతాకాన్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 32

శ్లో॥ మఞ్జీరపాదయుగళం శుభలక్షణలక్షితమ్ ।
ఫణిరాజవిరాజం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 33

శ్లో॥ నిరామయం నిరాధారం నిస్సఙ్గం నిష్ప్రపఞ్చకమ్ ।
తేజోరూపం మహారౌద్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 34

శ్లో॥ సర్వలోకైకపితరం సర్వలోకైకమాతరమ్ ।
సర్వలోకైకనాథం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 35

శ్లో॥ చిత్రామ్బరం నిరాభాసం వృషభేశ్వరవాహనమ్ ।
నీలగ్రీవం చతుర్వక్త్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 36

శ్లో॥ రత్నకఞ్చుకరత్నేశం రత్నకుణ్డలమణ్డితమ్ ।
నవరత్నకిరీటం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 37

శ్లో॥ దివ్యరత్నాఙ్గులీస్వర్ణకణ్ఠాభరణభూషితమ్ ।
నానారత్నమణిమయమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 38

శ్లో॥ రత్నాఙ్గులీయవిలసత్కరశాఖానఖప్రభమ్ ।
భక్తమానసగేహం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 39

శ్లో॥ వామాఙ్గభాగవిలసదమ్బికావీక్షణప్రియమ్ ।
పుణ్డరీకనిభాక్షం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 40

శ్లో॥ సమ్పూర్ణకామదం సౌఖ్యం భక్తేష్టఫలకారణమ్ ।
సౌభాగ్యదం హితకరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 41

శ్లో॥ నానాశాస్త్రగుణోపేతం స్ఫురన్మఙ్గళవిగ్రహమ్ ।
విద్యావిభేదరహితమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 42

శ్లో॥ అప్రమేయగుణాధారం వేదకృద్రూపవిగ్రహమ్ ।
ధర్మాధర్మప్రవృత్తిం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 43

శ్లో॥ గౌరీవిలాసవదనం జీవజీవపితామహమ్ ।
కల్పాన్తభైరవం శుభ్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 44

శ్లో॥ సుఖదం సుఖనాశం చ దుఃఖదం దుఃఖనాశనమ్ ।
దుఃఖావతారం భద్రం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 45

శ్లో॥ సుఖరూపం రూపనాశం సర్వధర్మఫలప్రదమ్ ।
అతీన్ద్రియం మహామాయమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 46

శ్లో॥ సర్వపక్షిమృగాకారం సర్వపక్షిమృగాధిపమ్ ।
సర్వపక్షిమృగాధారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 47

శ్లో॥ జీవాధ్యక్షం జీవవన్ద్యం జీవజీవనరక్షకమ్ ।
జీవకృజ్జీవహరణమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 48

శ్లో॥ విశ్వాత్మానం విశ్వవన్ద్యం వజ్రాత్మం వజ్రహస్తకమ్ ।
వజ్రేశం వజ్రభూషం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 49

శ్లో॥ గణాధిపం గణాధ్యక్షం ప్రళయానలనాశకమ్ ।
జితేన్ద్రియం వీరభద్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 50

శ్లో॥ త్ర్యమ్బకం మృడం శూరం చ హ్యరిషడ్వర్గనాశనమ్ ।
దిగమ్బరం క్షోభనాశమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 51

శ్లో॥ కున్దేన్దుశఙ్ఖధవళం త్రిభిరక్షిభిరుజ్జ్వలమ్ ।
కాలాగ్నిరుద్రం సర్వజ్ఞమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 52

శ్లో॥ కమ్బుగ్రీవం కమ్బుకణ్ఠం ధైర్యదం ధైర్యవర్ధకమ్ ।
శార్దూలచర్మవసనమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 53

శ్లో॥ జగదుత్పత్తిహేతుం చ జగత్ప్రళయకారణమ్ ।
పూర్ణానన్దస్వరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 54

శ్లో॥ సర్గకేశం మహత్తేజం పుణ్యశ్రవణకీర్తనమ్ ।
బ్రహ్మాణ్డనాయకం తారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 55

శ్లో॥ మన్దారమూలనిలయం మన్దారకుసుమప్రియమ్ ।
బృన్దారకప్రియతరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 56

శ్లో॥ మహేన్ద్రియం మహాబాహుం విశ్వాసపరిపూరకమ్ ।
సులభాసులభం లభ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 57

శ్లో॥ బీజాధారం బీజరూపం నిర్బీజం బీజవృద్ధిదమ్ ।
పరేశం బీజనాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 58

శ్లో॥ యుగాకారం యుగాధీశం యుగకృద్యుగనాశకమ్ ।
పరేశం బీజనాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 59

శ్లో॥ ధూర్జటిం పిఙ్గళజటం జటామణ్డలమణ్డితమ్ ।
కర్పూరగౌరం గౌరీశమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 60

శ్లో॥ సురావాసం జనావాసం యోగీశం యోగిపుఙ్గవమ్ ।
యోగదం యోగినాం సింహమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 61

శ్లో॥ ఉత్తమానుత్తమం తత్త్వమన్ధకాసురసూదనమ్ ।
భక్తకల్పద్రుమస్తోమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 62

శ్లో॥ విచిత్రమాల్యవసనం దివ్యచన్దనచర్చితమ్ ।
విష్ణుబ్రహ్మాదివన్ద్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 63

శ్లో॥ కుమారపితరం దేవం సితచన్ద్రకళాధరమ్ ।
బ్రహ్మశత్రుం జగన్మిత్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 64

శ్లో॥ లావణ్యమధురాకారం కరుణారసవారిధిమ్ ।
భ్రువోర్మధ్యేసహస్రార్చిమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 65

శ్లో॥ జటాధరం పావకాక్షమృక్షేశం భూమినాయకమ్ ।
కామదం సర్వదా గమ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 66

శ్లో॥ శివం శాన్తముమానాథం మహాధ్యానపరాయణమ్ ।
జ్ఞానప్రదం కృత్తివాసమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 67

శ్లో॥ వాసుక్యురగహారం చ లోకానుగ్రహకారణమ్ ।
జ్ఞానప్రదం కృత్తివాసమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 68

శ్లో॥ శశాఙ్కధారిణం భర్గం సర్వలోకైకశఙ్కరమ్ ।
శుద్ధం చ శాశ్వతం నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 69

శ్లో॥ శరణాగతి-దీనార్థి-పరిత్రాణ-పరాయణమ్ ।
గమ్భీరం చ వషట్కారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 70

శ్లో॥ భోక్తారం భోజనం భోజ్యం జేతారం జితమానసమ్ ।
కరణం కారణం జిష్ణుమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 71

శ్లో॥ క్షేత్రజ్ఞం క్షేత్రపాలం చ పరార్థైకప్రయోజనమ్ ।
వ్యోమకేశం భీమవేషమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 72

శ్లో॥ భవఘ్నం తరుణోపేతం క్షోదిష్ఠయమనాశకమ్ ।
హిరణ్యగర్భం హేమాఙ్గమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 73

శ్లో॥ దక్షం చాముణ్డజనకం మోక్షదం మోక్షనాయకమ్ ।
హిరణ్యదం హేమరూపమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 74

శ్లో॥ మహాశ్మశాననిలయం ప్రచ్ఛన్నస్ఫటికప్రభమ్ ।
వేదాశ్వం వేదరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 75

శ్లో॥ స్థిరం ధర్మముమానాథం బ్రహ్మణ్యం చాశ్రయం విభుమ్ ।
జగన్నివాసం ప్రథమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 76

శ్లో॥ రుద్రాక్షమాలాభరణం రుద్రాక్షప్రియవత్సలమ్ ।
రుద్రాక్షభక్తసంస్తోమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 77

శ్లో॥ ఫణీన్ద్రవిలసత్కణ్ఠం భుజఙ్గాభరణప్రియమ్ ।
దక్షాధ్వరవినాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 78

శ్లో॥ నాగేన్ద్రవిలసత్కర్ణమహీన్ద్రవలయావృతమ్ ।
మునివన్ద్యం మునిశ్రేష్ఠమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 79

శ్లో॥ మృగేన్ద్రచర్మవసనం మునీనామేకజీవనమ్ ।
సర్వదేవాదిపుణ్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 80

శ్లో॥ నిధనేశం ధనాధీశమపమృత్యువినాశనమ్ ।
లిఙ్గమూర్తిమలిఙ్గాత్మమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 81

శ్లో॥ భక్తకల్యాణదం వ్యస్తం వేదవేదాన్తసంస్తుతమ్ ।
కల్పకృత్ కల్పపాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 82

శ్లో॥ ఘోరపాతకదావాగ్నిం జన్మకర్మవివర్జితమ్ ।
కపాలమాలాభరణమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 83

శ్లో॥ మాతఙ్గచర్మవసనం విరాడ్రూపవిదారకమ్ ।
విష్ణుక్రాన్తమనన్తం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 84

శ్లో॥ యజ్ఞకర్మఫలాధ్యక్షం యజ్ఞవిఘ్నవినాశకమ్ ।
యజ్ఞేశం యజ్ఞభోక్తారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 85

శ్లో॥ కాలాధీశం త్రికాలజ్ఞం దుష్టనిగ్రహకారకమ్ ।
యోగిమానససంపూజ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 86

శ్లో॥ మహోన్నతమహాకాయం మహోదయమహాభుజమ్ ।
మహావక్త్రం మహావృద్ధమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 87

శ్లో॥ సునేత్రం సులలాటం చ సర్వభీమపరాక్రమమ్ ।
మహేశ్వరం శివతరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 88

శ్లో॥ సమస్తజగదాధారం సమస్తగుణసాగరమ్ ।
సత్యం సత్యగుణోపేతమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 89

శ్లో॥ మాఘకృష్ణచతుర్దశ్యాం పూజార్థం చ జగద్గురోః ।
దుర్లభం సర్వదేవానామ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 90

శ్లో॥ తత్రాపి దుర్లభం మన్యే నభోమాసేన్దువాసరే ।
ప్రదోషకాలే పూజాం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 91

శ్లో॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం శివాలయమ్ ।
కోటికన్యామహాదానమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 92

శ్లో॥ దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనమ్ ।
అఘోరపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 93

శ్లో॥ తులసీ–బిల్వ–నిర్గుణ్డీ–జమ్బీరామలకం తథా ।
పఞ్చబిల్వమితి ఖ్యాతమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 94

శ్లో॥ అఖణ్డబిల్వపత్రైశ్చ పూజయేన్నన్దికేశ్వరమ్ ।
ముచ్యతే సర్వపాపేభ్యో హ్యేకబిల్వం శివార్పణమ్ ॥ 95

శ్లో॥ సాలఙ్కృతా–శతవృత్తా–కన్యాకోటి–సహస్రకమ్ ।
సామ్రాజ్యపృథ్వీదానం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 96

శ్లో॥ దన్త్యశ్వకోటిదానాని హ్యశ్వమేథ–సహస్రకమ్ ।
సవత్సధేనుదానాని ఏకబిల్వం శివార్పణమ్ ॥ 97

శ్లో॥ చతుర్వేదసహస్రాణి భారతాదిపురాణకమ్ ।
సామ్రాజ్యపృథ్వీదానం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 98

శ్లో॥ సర్వరత్నమయం మేరుం కాఞ్చనం దివ్యవస్త్రకమ్ ।
తులాభారం శతావర్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 99

శ్లో॥ అష్టోత్తరశతం బిల్వం యోఽర్చయేల్లిఙ్గమస్తకే ।
అథర్వోక్తం వదేద్యస్తు ఏకబిల్వం శివార్పణమ్ ॥ 100

శ్లో॥ కాశీక్షేత్రనివాసం చ కాలభైరవదర్శనమ్ ।
అఘోరపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 101

శ్లో॥ అష్టోత్తరశతశ్లోకైః స్తోత్రాద్యైః పూజయేద్యథా ।
త్రిసన్ధ్యం మోక్షమాప్నోతి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 102

శ్లో॥ దన్తికోటిసహస్రాణాం భూహిరణ్యసహస్రకమ్ ।
సర్వక్రతుమయం పుణ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 103

శ్లో॥ పుత్రపౌత్రాదికం భోగం భుక్త్వా చాత్ర యథేప్సితమ్ ।
అన్త్యే చ శివసాయుజ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 104

శ్లో॥ విప్రకోటిసహస్రాణాం విత్తదానాచ్చ యత్ఫలమ్ ।
తత్ఫలం ప్రాప్నుయాత్ సత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 105

శ్లో॥ త్వన్నామకీర్తనం తద్వత్ తవ పాదామ్బు యః పిబేత్ ।
జీవన్ముక్తో భవేన్నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 106

శ్లో॥ అనేకదానఫలదమనన్తసుకృతాదికమ్ ।
తీర్థయాత్రాఖిలం పుణ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 107

శ్లో॥ త్వం మాం పాలయ సర్వత్ర పదధ్యానకృతం తవ ।
భవనం శాఙ్కరం నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 108

## అధికపాఠములు

శ్లో॥ ఉమయాసహితం దేవం సవాహనగణం శివమ్ ।
భస్మానులిప్తసర్వాఙ్గం ఏకబిల్వం శివార్పణమ్ ॥ 109

శ్లో॥ సాలగ్రామసహస్రాణి విప్రాన్నం శతకోటికమ్ ।
యజ్ఞకోటిసహస్రాణి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 110

శ్లో॥ అజ్ఞానేన కృతం పాపం జ్ఞానేనాపి కృతం చ యత్ ।
తత్సర్వం నాశమాయాతు ఏకబిల్వం శివార్పణమ్ ॥ 111

శ్లో॥ ఏకైకబిల్వపత్రేణ కోటియజ్ఞఫలం భవేత్ ।
మహాదేవస్య పూజార్థమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 112

శ్లో॥ అమృతోద్భవవృక్షస్య మహాదేవప్రియస్య చ ।
ముచ్యతే కణ్టకాఘాతాత్ కణ్టకేభ్యో హి మానవాః ॥ 113

## ఫలశ్రుతి

శ్లో॥ ఏకకాలే పఠేన్నిత్యం సర్వశత్రునివారణమ్ ।
ద్వికాలే చ పఠేన్నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **114**

శ్లో॥ త్రికాలే చ పఠేన్నిత్యం మనోవాఞ్ఛాఫలప్రదమ్ ।
అచిరాత్ కార్యసిద్ధిం చ లభతే నాత్ర సంశయః ॥ **115**

శ్లో॥ ఏకకాలం ద్వికాలం వా త్రికాలం యః పఠేన్నరః ।
లక్ష్మీప్రాప్తిః శివావాసః శివేన సహ మోదతే ॥ **116**

శ్లో॥ కోటిజన్మకృతం పాపమర్చనేన వినశ్యతి ।
సప్తజన్మకృతం పాపం శ్రవణేన వినశ్యతి ॥ **117**

శ్లో॥ జన్మాన్తరకృతం పాపం పఠనేన వినశ్యతి ।
దివారాత్రకృతం పాపం దర్శనేన వినశ్యతి ॥ **118**

శ్లో॥ క్షణే క్షణే కృతం పాపం స్మరణేన వినశ్యతి ।
పుస్తకం ధారయేద్దేహీ హ్యారోగ్యం భయనాశనమ్ ॥ **119**

శ్లో॥ యే మామనన్యశరణాస్సతతం వరేణ్యం
సంపూజయన్తి నవకోమలబిల్వపత్రైః ।
తే నిర్గుణా అపి గుణామ్బుధయో భవన్తి
విన్దన్తి భక్తిమనుభుక్తసమస్తభోగాః ॥ **120**

శ్లో॥ బిల్వాష్టోత్తరశతం స్తోత్రం యః పఠేద్ భక్తిమాన్నరః ।
శివలోకమవాప్నోతి శివేన సహ మోదతే ॥ **121**

శుభమస్తు

లోకాః సమస్తాః సుఖినో భవన్తు

ఓం శాంతిః శాంతిః శాంతిః ఓం

**శ్రీః**

శ్రీః

# శ్రీబిల్వాష్టోత్తరశతనామస్తోత్రమ్

(శివోల్లాసవ్యాఖ్యానము – స్ఫూర్తిశ్రీ)



శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం త్రిణేత్రం చ త్ర్యాయుధమ్ ।
త్రిజన్మపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **1**

 

**ప్ర :** త్రిదళమ్ = మూడు రేకులు కలదియు, త్రిగుణాకారమ్ = సత్త్వ రజ స్తమోగుణములను సూచించెడి ఆకారము కలదియు, త్రిణేత్రమ్ = మూడు రేకులే మూడు కన్నులుగా కలదియు, త్రి + ఆయుధమ్ = మూడు రేకులే మూడు మొనలుగాగల ఆయుధమైనదియు, త్రిజన్మపాపసంహారమ్ = మూడు జన్మముల యందలి పాపములను తొలగించునదియు, అయిన, ఏకబిల్వమ్ = ఒక మారేడు పత్రమును, శివ = శివునికి, అర్పణమ్ (కరోమి) = అర్పించుచున్నాను.

  

**తా :** మూడు రేకులు గలిగి, మూడు గుణములను సూచించునదై, మూడు కన్నులు కలిగి మూడు మొనలతో త్రిశూలమువలె ఉండి మూడు జన్మముల పాపములను తొలగించెడు బిల్వపత్రము నొకదానిని శివునికి సమర్పించుచున్నాను. (బిల్వ పత్రము శివునికి ప్రీతిపాత్రము. అందుకే బిల్వపత్రములతో శివునికి పూజ చేయుదురు).

**శ్లో॥ త్రిశాఖైర్బిల్వపత్రైశ్చ హ్యచ్ఛిద్రైః కోమలైః శుభైః ।**
**తవ పూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 2**

**ప్ర :** త్రిశాఖైః = మూడుగా విడిన, అచ్ఛిద్రైః = కన్నములు లేనివియు, కోమలైః = సుకుమారము లైనవియు, శుభైః = మంగళకరము లైనవియు, బిల్వపత్రైః + చ = మారేడాకులతో, తవ పూజామ్ = నీ యొక్క పూజను, కరిష్యామి = చేయుదును, ఏకబిల్వమ్ = ఒక మారేదు పత్రమును, శివ+అర్పణమ్ = శివా! నీకు సమర్పించు చున్నాను.

**తా :** చినుగులు కాని రంధ్రములు కాని లేని, సుకుమారములైన, మంగళ కరములయిన, మూడు రేకులుగా విడియున్న బిల్వపత్రములతో నీకు పూజ చేయుదును. శివా! నీకు ఒక బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

**శ్లో॥ సర్వత్రైలోక్యకర్తారం సర్వత్రైలోక్యపాలనమ్ ।**
**సర్వత్రైలోక్యహర్తారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 3**

**ప్ర :** సర్వ – త్రైలోక్య – కర్తారమ్ = సమస్తమయిన మూడు లోకములను సృష్టించువానిని, సర్వత్రైలోక్యపాలనమ్ = సమస్తమైన మూడు లోకములను పాలించు వానిని, సర్వత్రైలోక్యహర్తారమ్ = సమస్తమైన మూడు లోకములను హరించు వానిని, (స్తువన్ = స్తోత్రము చేయుచు), ఏకబిల్వమ్ = ఒక బిల్వపత్రమును, శివార్పణమ్ = శివునికి అర్పించుచున్నాను.

**తా :** మూడు లోకములకు జనకుడును, పోషకుడును, లయకారుడును అయిన వానిని స్తోత్రము చేయుచు శివా! నీకు బిల్వపత్రము నొకదానిని సమర్పించు చున్నాను.

(**విశేషము :** శివ + అర్పణం అన్నప్పుడు శివునికి అర్పించుచున్నానని అర్థము చెప్పవచ్చును. అట్లు కాక 'శివ = ఓ శివా' అని సంబుద్ధిగా స్వీకరించి 'అర్పణం' అర్పణము చేయుచున్నాను. రెండు విధములుగాను కూడ "కరోమి" అను క్రియారూపము అధ్యాహృతము కావలెను. అట్లే మొదటి విశేషణములు మూడును శివునికి అన్వయించుచున్నవి. కావున త్రిలోకములకును కర్తయు, భర్తయు, హర్తయునైన నిన్ను స్తోత్రము చేసి శివా! నీకు బిల్వపత్రము నొకదానిని సమర్పించు చున్నాను అని చెప్పుట జరుగుచున్నది. అందువల్ల పాఠకుడు 'స్తువన్ = స్తోత్రం చేసి' అన్న భావమును కలుపు కొనవలయును. మొదటి శ్లోకములో బిల్వపత్రమునకు, పరమేశ్వరునికి అభేదాధ్యవసాయమును పరిగణింపవచ్చును. కాని రెండవ శ్లోకమునుండియే ఆ క్రమము మారినది. కావున 'స్తువన్' అని అధ్యవసాయము చేసికొనుట అవసర మగుచున్నది.)

**శ్లో॥ నాగాధిరాజవలయం నాగహారేణభూషితమ్ ।**
**నాగకుణ్డలసంయుక్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 4**

**ప్ర :** నాగాధిరాజవలయమ్ = సర్పరాజును కంకణముగా ధరించిన వానిని, నాగహారేణ = సర్పహారముచేత, భూషితమ్ = అలంకరింపబడిన వానిని, నాగ-కుణ్డలసంయుక్తమ్ = పాములను కర్ణాభరణములుగా కలిగి యున్నవానిని, ....

**తా :** శివుడు భుజంగభూషణుడు. కావుననే హస్తకంకణముగా సర్పరాజును ధరించి యున్నాడు. అట్లే మరియొక సర్పమును కంఠహారముగా అలంకరించు కొని యున్నాడు. మరి రెండు సర్పములను కర్ణకుండలములుగా స్వీకరించి యున్నాడు. అందువలననే సాధకుడు ఆయా భూషణములతో ఉండి సాక్షాత్కరించి యున్న శివుని స్తోత్రము చేయుచు 'శివా! బిల్వపత్రము నొకదానిని సమర్పించు చున్నా'నని చెప్పుచున్నాడు. (దర్శనమును బట్టి వర్ణన. భక్తిని బట్టి మారేడు పత్ర సమర్చన. ఈ రెండును ఏకకాలమున జరుగుచున్నవని తాత్పర్యము. ఇంక ముందు సైతము ఇట్లే సమన్వయము చేసికొనవలెను.)

**శ్లో॥ అక్షమాలాధరం రుద్రం పార్వతీప్రియవల్లభమ్ ।**
**చన్ద్రశేఖరమీశానమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 5**

**ప్ర :** అక్షమాలాధరమ్ = అక్షమాలను ధరించిన వానిని, రుద్రమ్ = రోదించువారి దుఃఖమును మాన్పి ఆనందమును కలిగించువానిని, పార్వతీప్రియవల్లభమ్ = పార్వతీప్రాణేశ్వరుడైన వానిని, చంద్రశేఖరమ్ = చంద్రుని శిరోభూషణముగా ధరించినవానిని, ఈశానమ్ = ఈశ్వరుడవైన నిన్ను....

**తా :** శివా! నీవు అక్షమాలను ధరించి యున్నావు. దుఃఖించువారి దుఃఖమును తొలగించి ఆనందము నందించెదవు. పార్వతికి ప్రియవల్లభుడవు. చంద్రుని శిరోభూషణముగా ధరించి యున్నావు. అట్టి ఈశ్వరుడవైన నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వపత్రమును సమర్పణ చేయుచున్నాను.

**శ్లో॥ త్రిలోచనం దశభుజం దుర్గాదేహార్ధధారిణమ్ ।**
**విభూత్యభ్యర్చితం దేవమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 6**

**ప్ర :** త్రిలోచనమ్ = మూడు కన్నులు గలవానిని, దశభుజమ్ = పది బాహువులు గలవానిని, దుర్గాదేహార్ధధారిణమ్ = పార్వతీదేవిని శరీరార్ధమునందు ధరించు వానిని, విభూతి + అభి + అర్చితమ్ = విభూతితో మిక్కిలి అర్చింపబడిన వానిని, దేవమ్ = ప్రకాశమయుడైన దేవుని ....

**తా :** త్రినేత్రుడవు, దశభుజుడవు, అర్ధనారీశ్వరుడవు, విభూతిచేత పూజింపబడు వాడవు, ప్రకాశమానుడవైన దేవుడవు అయిన నిన్ను స్తోత్రము చేయుచు శివా! నీకు బిల్వపత్రము నొకదానిని సమర్పించుచున్నాను.

**శ్లో॥ త్రిశూలధారిణం దేవం నాగాభరణసున్దరమ్ ।**
**చన్ద్రశేఖరమీశానమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 7**

**ప్ర :** త్రిశూలధారిణమ్ = త్రిశూలమనెడి మూడు మొనల ఆయుధమును ధరించిన వానిని, దేవమ్ = క్రీడాపరాయణుడయిన వానిని, నాగాభరణసుందరమ్ = సర్పములనే అలంకారములుగా ధరించి శోభించు వానిని, చంద్రశేఖరమ్ = చంద్రుని శిరోభూషణముగా ధరించిన వానిని, ఈశానమ్ = ఈశ్వరుని....

**తా :** ఓ శివా! నీవు త్రిశూలమును ధరించి యున్నావు. సర్పభూషణములతో అలంకరింపబడి యున్నావు. నటరాజువై నాట్యము చేయుచున్నావు. చంద్రుని శిరోభూషణముగా ధరించి యున్నావు. నీవే యీశ్వరుడవు. ఈ విధముగా నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వపత్రమును సమర్పించుచున్నాను. (అయిదవ శ్లోకము నందలి ఉత్తరార్ధమే యిచట పునరుక్తమయినది).

**శ్లో॥ గఙ్గాధరామ్బికానాథం ఫణికుణ్డలమణ్డితమ్ ।**
**కాలకాలం గిరీశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 8**

**ప్ర :** గంగాధర! = గంగను ధరించిన ఓ శివా!, అంబికానాథమ్ = జగదంబికయైన పార్వతీదేవికి ప్రాణనాథుడైన వానిని, ఫణికుణ్డలమణ్డితమ్ = పాములనెడి కర్ణకుండలములచేత అలంకరింపబడిన వానిని, కాలకాలమ్ = యమునికి యముడైన వానిని, గిరీశమ్ = కైలాసగిరికి ప్రభువైన వానిని....

**తా :** ఓ గంగాధరా! ఓ హరా! జగన్మాతయైన పార్వతీదేవికి ప్రాణవల్లభుడవును, పాములనే కర్ణకుండలములుగా అలంకరించు కొనినవాడవును, మార్కండేయుడనెడి భక్తుని కాపాడుటకొరకై యమునికై యమునిగా ప్రవర్తించిన వాడవును, కైలాస గిరీశ్వరుడవు అయిన నిన్ను దర్శించుచు స్తుతించుచు నీకు ఒక బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.



**శ్లో॥ శుద్ధస్ఫటికసఙ్కాశం శితికణ్ఠం కృపానిధిమ్ ।**
**సర్వేశ్వరం సదాశాన్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 9**

 

**ప్ర :** శుద్ధస్ఫటికసంకాశమ్ = శుద్ధమైన స్ఫటికమువంటి వానిని, శితికంఠమ్ = నల్లని కంఠము గలవానిని, కృపానిధిమ్ = దయకు గని వంటి వానిని, సర్వేశ్వరమ్ = సర్వమునకు ప్రభువైన వానిని, సదాశాంతమ్ = ఎల్లప్పుడును శాంతముగా ఉండువానిని....

  

**తా :** ఓ శివా! నీవు శుద్ధస్ఫటికమువలె తెల్లని శరీరము గల వాడవు. నల్లని మెడ గల వాడవు (హాలాహలభక్షణముచేత కంఠము నల్లగా మాడిపోయినది. అంతర్గత-బహిర్గతలోకముల రక్షణకై శివుడు హాలాహలమును త్రాగి కంఠము నందే నిలుపుకొనెను). ఈ సన్నివేశము నీ దయాపరత్వమునకు నిదర్శనము. నీవు సర్వలోకములకు సర్వకాలములకు ఈశ్వరుడవు. ఎల్లప్పుడును శాంతముగా ఉండుటయే నీ స్వభావము. ఇట్టి నిన్ను దర్శించుచు నీకొక బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ సచ్చిదానన్దరూపం చ పరానన్దమయం శివమ్ ।**
**వాగీశ్వరం చిదాకాశమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 10**

**ప్ర :** శివ = ఓ శివా! సత్ + చిత్ + ఆనన్దరూపమ్ = శాశ్వతమును చైతన్యాత్మక-మును ఆనందమును అయిన రూపముగల వానిని, చ = మరియు, పర + ఆనన్దమయమ్ = ఉత్తమమైన ఆనందమే స్వరూపముగా గలవానిని, శివమ్ = మంగళకరమైన వానిని, వాక్ + ఈశ్వరమ్ = వాక్కులను తన అధీనము నందుంచుకొను వానిని, చిత్ + ఆకాశమ్ = చైతన్యయుక్తమైన జ్ఞానముచేత సర్వత్ర ప్రకాశించు వానిని....

**తా :** ఓ శివా! నీవు సచ్చిదానందరూపుడవు. ఉత్తమమైన ఆనందమే నీవు. నీవు మంగళకరుడవు. వాక్కులకు ఈశ్వరుడవు. నీ అనుమతి లేనియెడల మా నోట వాక్కులు వెలువడవు. చిచ్ఛక్తిచేత నీవు అంతటను ప్రకాశించుచున్నావు. చిన్మయుడవు నీవు. ఇట్టి నిన్ను దర్శించుచు మారేడు రేకును నీకు పూజాదళముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ శిపివిష్టం సహస్రాక్షం దున్దుభ్యం చ నిషఙ్గిణమ్ ।**
**హిరణ్యబాహుం సేనాన్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 11**

**ప్ర :** శిపివిష్టమ్ = పశువులయందు వ్యాప్తి పొందిన వానిని, సహస్ర + అక్షమ్ = వెయ్యి (అనేకమయిన) కన్నులు గలవానిని, దున్దుభ్యమ్ = ఢక్కా కలిగిన వానిని, చ = మరియు, నిషఙ్గిణమ్ = అమ్ములపొది గలవానిని, హిరణ్యబాహుమ్ = బంగారు చేతులు గలవానిని, సేనాన్యమ్ = సేనాధిపతిని గలవానిని....

**తా :** ఓ శివా! నీవు పశుపతివి, నీవు సహస్రాక్షుడవు, ఢక్కాను మ్రోగించు వాడవు. (శివుడు నటరాజు. సంధ్యాసమయమందు ఢక్కా మ్రోగించుచు నాట్యము చేయును). అమ్ములపొది గలవాడవు (ఈశ్వరుడు తన బాణములచేత భక్తుల పాపములను కొట్టి వేయును. అర్జునుడు పాశుపతసంపాదనార్థము తపస్సు చేయుచుండగా కిరాతవేషుడైన శివుడు అమ్ములపొదిని ధరించి యుండెను). నీవు బంగారు బాహువులను గలవాడవు. నీవు సేనానిని గలవాడవు. (దేవతలకు సేనాధిపతిగా కుమారస్వామిని అనుగ్రహించిన వాడు శివుడు). ఇట్టి నిన్ను దర్శించుచు ఒక బిల్వపత్రముతో పూజించుచున్నాను.

**శ్లో॥ అరుణం వామనం తారం వాస్తవ్యం చైవ వాస్తువమ్ ।**
**జ్యేష్ఠం కనిష్ఠం వైశన్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 12**

**ప్ర :** అరుణమ్ = ఎఱ్ఱని వానిని, వామనమ్ = సుందరుడైన వానిని, తారం వాస్తవ్యమ్ = వెండి కొండ యందు నివసించు వానిని, వాస్తువమ్ = వాస్తు కళ యందు కుశలుడైన వానిని, జ్యేష్ఠమ్ = దేవతలలో పెద్దయైన వానిని, కనిష్ఠమ్ = కఠినమైన నిష్ఠ గలవానిని, వైశంతమ్ = దుష్టులను సంహరించు వానిని....

**తా :** ఓ శివా! నీవు లోహితశరీరుడవు. సుందరుడవు. రజతాచలవాసివి. వాస్తుకళా ప్రవీణుడవు. దేవతలలో జ్యేష్ఠుడవు. కఠినమయిన నిష్ఠ కలవాడవు. దుష్టులను సంహరించు వాడవు. ఇట్టి నిన్ను దర్శించుచు స్తుతించుచు నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ హరికేశం సనన్దీశముచ్చైర్ఘోషం సనాతనమ్ ।**
**అఘోరరూపకం కుమ్భమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 13**

**ప్ర :** శివ = ఓ శివా!, హరి + క + ఈశమ్ = విష్ణుమూర్తికి, బ్రహ్మకు ప్రభువైన వానిని, స + నందీశమ్ = నందీశ్వరుని కలిగియున్న వానిని, ఉచ్చైః + ఘోషమ్ = బిగ్గరగా ధ్వని చేయు వానిని, సనాతనమ్ = ఆద్యంతములులేక ఎల్లప్పుడు నుండు వానిని, అఘోరరూపకమ్ = మిక్కిలి భయంకరమైన రూపము గలవానిని, కుంభమ్ = భూమి నంతటిని నిండి యున్నవానిని....

**తా :** ఓ శివా! నీవు విష్ణుమూర్తికిని విరించికిని ప్రభుడవు. నీ వాహనమైన నందీశ్వరునితో కూడి యున్నవాడవు. ఉన్నతమైన పిలుపు గలవాడవు. ఆద్యంతములు లేనివాడవు కాబట్టి సనాతనుడవు. నీవు శివుడవే అయినప్పటికి మంగళరూపమును విడిచి భయంకరరూపమును ధరించి కొన్నివేళలందు ఉగ్రుడ వగుదువు. నీవు సర్వవ్యాపకుడ వగుటచేత భూమియంత నీతో నిండి యుండును. ఇట్టి నిన్ను భావించుచు దర్శించుచు పూజాపత్రముగా నీకు బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

శ్లో॥ పూర్వజావరజం యామ్యం సూక్ష్మతస్కరనాయకమ్ ।
నీలకణ్ఠం జఘన్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 14

ప్ర : పూర్వజ + అవరజమ్ = పూర్వము పుట్టిన వానిని అనంతరమందు పుట్టిన వానిని, యామ్యమ్ = యమము కలిగిన వానిని, సూక్ష్మతస్కరనాయకమ్ = సూక్ష్మరూపమున తస్కరనాయకుడై సంచరించు వానిని, నీలకంఠమ్ = నల్లని మెడ గలవానిని, జఘన్యమ్ = దిసమొల గలవానిని....

**తా :** ఓ శివా! నీవు సృష్టికి పూర్వమే యుంటివి. అందువలన నీకు పుట్టుక యున్నదో లేదో తెలియదు. భవశబ్దముచేత పుట్టుక యున్నదనుకొన్నయెడల అదియెంత పూర్వమో తెలియదు. అందువల్లనే నీవు పూర్వజుడవు. భక్తరక్షణ నిమిత్తము ఇప్పటికెన్ని పర్యాయములు జనించితివో! ఈ అవతారములవలన నీవు అవరజుడవు. నీవు యమనియమాదుల గలిగిన యతివి. నీవు దొంగలకు నాయకుడవు. మాలో ఉన్న దుర్గుణములను దోచుకొనుటకై నీవు సూక్ష్మరూపమున దొంగలనాయకునివలె వత్తువు. మమ్ములను గుణయుక్తులను చేయుటకే నీ తస్కర నాయకత్వము. హరశబ్దముచేత సైతము ఇదియే స్ఫురించుచున్నది. పరోప-కారమునకై హాలాహలమును మ్రింగుటచేత నీ మెడ నల్లనైననది. నీకు దిక్కులే వస్త్రము లగుటచేత నీవు దిగంబరుడవైతివి. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి సేవించుచున్నాను.

**శ్లో॥ సురాశ్రయం విషహరం వర్మిణం చ వరూధినమ్ ।**
**మహాసేనం మహావీరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 15**

**ప్ర :** సురాశ్రయమ్ = దేవతలకు ఆశ్రయమైన వానిని, విషహరమ్ = విషమును హరించిన వానిని, చ = మరియు, వర్మిణమ్ = కవచము కల వానిని, వరూధినమ్ = సైన్యము గలవానిని, మహాసేనమ్ = గొప్ప సేనలను కలిగిన వానిని, మహావీరమ్ = గొప్ప వీరులను కలిగిన వానిని....

**తా :** ఓ శివా! నీవు దేవతలకు ఆధారమైన వాడవు, సముద్రమథన సమయమున పుట్టిన కాలకూటవిషమును మ్రింగి వేసి సర్వలోకములను కాపాడిన వాడవు, కవచము ధరించి, మహాసైన్యములను కలిగి, సేనాధిపతులను కలిగి స్వయముగా మహావీరుడవై యున్నవాడవు. ఇట్టి నిన్ను భావించుచు మారేడుపత్రమును నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ కుమారం కుశలం కూప్యం వదాన్యం చ మహారథమ్ ।**
**తౌర్యత్రయం చ దేవం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 16**

**ప్ర :** కుమారమ్ = యౌవనవంతుని, కుశలమ్ = నేర్పుగలవానిని, కూప్యమ్ = గుహ్యముగా నుండు వానిని, వదాన్యమ్ = దాతృత్వము గల వానిని, చ = మరియు, మహారథమ్ = మహారథము కలిగిన వానిని, తౌర్యత్రయమ్ = నృత్త గీతవాద్యములను గల వానిని, దేవమ్ = దేవుని,....

**తా :** శివా! నీవు నిత్యయౌవనుడవు, సర్వకార్యప్రవీణుడవు, గుహ్యముగా నుండువాడవు, గొప్పదాతవు. త్రిపురాసుర సంహార సమయమున భూమినే రథముగా ఉపయోగించు కొన్న మహారథికుడవు. నీవు మహానటుడవు, నటరాజువు. నృత్తగీతవాద్యములనెడి తౌర్యత్రయము గలవాడవు. దేవదేవుడవు. ఇట్టి నిన్ను దర్శించుచు బిల్వపత్రమును సమర్పించి అర్చించుచున్నాను. ('తౌర్యాతౌర్యం' అను పాఠాంతరము కంటె "తౌర్యత్రయం" సుగమము)

**శ్లో॥ దశకర్ణం లలాటాక్షం పఞ్చవక్త్రం సదాశివమ్ ।**
**అశేషపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 17**

**ప్ర :** దశకర్ణమ్ = పది చెవులు గలవానిని, లలాటాక్షమ్ = నొసట నేత్రమును గలవానిని, పంచవక్త్రమ్ = అయిదు ముఖములు కలవానిని, సదాశివమ్ = ఎల్లప్పుడును శుభములు కలిగించువానిని, అశేషపాపసంహారమ్ = సర్వ పాపములను నశింపజేయు వానిని....

**తా :** ఓ శివా! నీకు పది చెవులు కలవు, ఫాలభాగమునందు అగ్నినేత్రము కలదు, అయిదు ముఖములు గలవు. ఎల్లప్పుడును శుభరూపుడవై శుభములనే నీవు కలిగింతువు. సర్వపాపములను సమూలముగా నశింపజేయుదువు. ఇట్టి నిన్ను ధ్యానించుచు, నీకు ఒక మారేడు పత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ నీలకణ్ఠం జగద్వన్ద్యం దీననాథం మహేశ్వరమ్ ।**
**మహాపాపహరం శమ్భుమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 18**

**ప్ర :** నీలకంఠమ్ = నల్లని మెడగలవానిని, జగత్ + వంద్యమ్ = సర్వ ప్రపంచమునకు వందనీయుడైన వానిని, దీననాథమ్ = అనాథులకు రక్షకుడైన వానిని, మహేశ్వరమ్ = మహేశ్వరు డన్న సార్థకనామము గలవానిని, మహా-పాపహరమ్ = మహాపాతకములను సైతము నశింప జేయువానిని, శంభుమ్ = సుఖమునకు జన్మస్థానమైన వానిని....

**తా :** శివా! హాలాహల భక్షణముచేత నీ తెల్లని కంఠము నల్లగా అయినది. అప్పటినుండి నీకు నీలకంఠుడన్న నామ మేర్పడినది. నీవు చేసిన ఉపకారము సర్వజగత్తులను రక్షించునది. అందువల్లనే సర్వలోకములకు నీవు వందనీయుడ వైతివి, ఆర్తుల ఆర్తిని పోగొట్టి ఆదుకొను వాడవు నీవు ("దీనానాథం" అని అన్నచో దీనులను, అనాథులను కలిగి ఉన్నవాడవు. అనగా వారికి ఆశ్రయమిచ్చి రక్షించు వాడవు అని అర్థము చెప్పుకొన వలయును). నీవు సర్వాధికుడ వగుటచేత మహేశ్వరుడన్న సార్థకనామధేయము గలవాడవు. మహాపాపములను సైతము తొలగింతువు. ఆ విధముగా సుఖమును శాంతిని కలిగింతువు. ఇట్టి నిన్ను భావించుచు నీకు బిల్వదళమును సమర్పణము చేయుచున్నాను.

**శ్లో॥ చూడామణీకృతవిధుం వలయీకృతవాసుకిమ్ ।**
**కైలాసనిలయం భీమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 19**

**ప్ర :** చూడామణీకృతవిధుమ్ = చంద్రుని శిరోభూషణముగా చేసికొన్నవానిని, వలయీకృతవాసుకిమ్ = వాసుకిని కంకణముగా చేసి కొన్నవానిని, కైలాసనిలయమ్ = కైలాసమందు నివసించు వానిని, భీమమ్ = భయము గొల్పువానిని....

**తా :** ఓ శివా! నీవు చంద్రుని అనుగ్రహించి శిరోభూషణముగా ధరించితివి. సర్పరాజయిన వాసుకిని కంకణముగా ధరించితివి. కైలాసపర్వతమును నివాస స్థానముగా అనుగ్రహించితివి. శివుడవే అయిన్పటికి సాధువులను హింసించు దుష్టులను శిక్షించుటకై భయంకరరూపమును ధరించితివి. ఇట్టి నిన్ను భావించుచు మారేడు పత్రమును నీకు పూజాపత్రముగా సమర్పించి అర్చించుచున్నాను.

శ్లో॥ కర్పూరకున్దధవళం నరకార్ణవతారకమ్ ।
కరుణామృతసిన్ధుం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 20

**ప్ర :** కర్పూరకున్దధవళమ్ = కర్పూరమువలె, మల్లెపువ్వువలె తెల్లనైన వానిని, నరక + ఆర్ణవ - తారకమ్ = సముద్రమువంటి నరకమును దాటించు వానిని, కరుణామృతసిన్ధుమ్ = దయయనెడి అమృతమునకు సముద్రమువంటి వానిని....

**తా :** ఓ శివా! నీ శరీరము కర్పూరమువలె, మల్లెపువ్వువలె (మొల్ల పువ్వువలె) తెల్లని వన్నె గలది. సముద్రమువలె విశాలమయిన నరకమునుండి నీవు నీ భక్తులను దాటింతువు. నీ దయయనెడి అమృతము సముద్రమువలె అపారమైనది. ఇట్టి విశేషములు కల్గిన నిన్ను ధ్యానించుచు నీకు మారేదు దళమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ మహాదేవం మహాత్మానం భుజఙ్గాధిపకఙ్కణమ్ ।**
**మహాపాపహరం దేవమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 21**

**ప్ర :** మహాదేవమ్ = మహాదేవుని, మహాత్మానమ్ = మహాత్ముని, భుజఙ్గాధిప-కఙ్కణమ్ = సర్పరాజును కంకణముగా ధరించిన వానిని, మహాపాపహరమ్ = మహాపాపములను సైతము నశింపజేయువానిని, దేవమ్ = ప్రకాశమానుడైన వానిని, (ఉత్తరార్ధము పునరుక్తమైనది.)....

**తా :** ఓ శివా! నీవు దేవజ్యేష్ఠుడవు. కావున మహాదేవుడవు. అఖండమైన ఆత్మ స్వరూపుడవు. కావున మహాత్ముడవు. సర్పరాజయిన వాసుకిని కంకణముగా గ్రహించి అనుగ్రహించిన వాడవు. మహాపాపములను సైతము నశింప జేసెడి వాడవు. ఆయాగుణవిశేషముల చేత ప్రకాశించువాడవు. అట్టి నిన్ను దేవదేవా! శివా! మనసులో సాక్షాత్క రింపజేసికొనుచు నీకు బిల్వపత్రమును సమర్పించి నిన్ను అర్చించుచున్నాను.

(మానవులు పాపములు అజ్ఞానముచేతనో, అహంకారము చేతనో చేయుదురు. అంతమాత్రముచేత నిష్కృతిలేదని నిస్పృహ చెందవలసిన అవసరము లేదు. భగవంతుని శరణుచొచ్చుటచేత మహాపాపములు సైతము నశించును.)

**శ్లో॥ భూతేశం ఖణ్డపరశుం వామదేవం పినాకినమ్ ।**
**వామే శక్తిధరం శ్రేష్ఠమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 22**

**ప్ర :** భూత + ఈశమ్ = భూతనాథుని, ఖండపరశుమ్ = గొడ్డలిని ఆయుధముగా ధరించిన వానిని, వామదేవమ్ = వామదేవుడను పేరుగల వానిని, పినాకినమ్ = పినాకమనెడి ధనుస్సును గలవానిని, వామే = ఎడమ భాగమునందు, శక్తిధరమ్ = పార్వతిని ధరించియున్నవానిని, శ్రేష్ఠమ్ = ఉత్తమోత్తముని....

**తా :** ఓ శివా! నీవు సర్వభూతములకు అధిపతివి, గండ్రగొడ్డలిని ఆయుధముగా ధరించి ఖండపరశువనెడి నామమును బడసినవాడవు. వామదేవుడనెడి సౌందర్య స్ఫోరకమయిన పేరు గలవాడవు. పినాక మనెడి ధనుస్సును ధరించిన వాడవు. ఎల్లప్పుడును నీ యెడమ భాగమునందు పార్వతీదేవిని ధరించి అర్ధనారీశ్వరుడన్న అభిధానమును సంపాదించుకొన్న వాడవు. అందరిలోను అగ్రగణ్యుడవు. అట్టి నిన్ను భావించుచు బిల్వపత్రముతో అర్చించుచున్నాను.

**శ్లో॥ ఫాలేక్షణం విరూపాక్షం శ్రీకణ్ఠం భక్తవత్సలమ్ ।**
**నీలలోహితఖట్వాఙ్గమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 23**

**ప్ర :** ఫాలేక్షణమ్ = లలాటనేత్రుని, విరూపాక్షమ్ = విషమలోచనుని, శ్రీ కంఠమ్ = నీలకంఠుని, భక్తవత్సలమ్ = భక్తులయందు వాత్సల్యము గలవానిని, నీలలోహిత-ఖట్వాఙ్గమ్ = నల్లని యెఱ్ఱని వర్ణములు గల మంచపుకోడు ఆయుధముగా గల శివుని....

**తా :** నొసట నేత్రముగలవానిని, సమములు గాని కన్నులు కలవానిని, (రెండు నాలుగు మొదలయినవి సమసంఖ్యలు. మూడు విషమము. అంతే కాక రెండు కన్నులు సమక్రమములో ఉండగా ఒకటి అడ్డము తిరిగి యుండును. అదియే విరూపాక్షత్వము. హాలాహలముచేత నల్లబడిన కంఠము గలవానిని భక్తులయందు వాత్సల్యము గలవానిని, నల్లని యెఱ్ఱని వర్ణములు గల మంచపుకోడు ఆయుధముగా గల శివుని స్తోత్రము చేయుచు మారేడు పత్రమును సమర్పించుచున్నాను.

**శ్లో॥ కైలాసవాసినం భీమం కఠోరం త్రిపురాన్తకమ్ ।**
**వృషాఙ్కం వృషభారూఢమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 24**

**ప్ర :** శివ = ఓ శివా!, కైలాసవాసిమ్ = కైలాసమున నివసించు వానిని, భీమమ్ = భయంకరుడైన వానిని, కఠోరమ్ = కఠినుడైన వానిని, త్రిపురాంతకమ్ = త్రిపురాసురులను నాశనము చేసిన వానిని, వృషాఙ్కమ్ = వృషభమును ధ్వజ చిహ్నముగా గలవానిని, వృషభ + ఆరూఢమ్ = ఎద్దును అధిరోహించు వానిని....

**తా :** ఓ శివా! నీవు కైలాసవాసివి, భయంకరుడవు (భీమేశ్వర నామధేయుడవు), కఠినుడవు, త్రిపురాసురులను సంహరించి వారి పట్టణములను దగ్ధమొనరించిన వాడవు. వృషభధ్వజుడవు. వృషభవాహనుడవు. ఇట్టి నిన్ను సందర్శించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ సామప్రియం సర్వమయం భస్మోద్ధూళితవిగ్రహమ్ ।**
**మృత్యుఞ్జయం లోకనాథమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 25**

**ప్ర :** సామప్రియమ్ = సామగానమునందు ప్రేమగలవానిని, సర్వమయమ్ = సర్వమునందు నిండియున్న వానిని, భస్మ + ఉద్ధూళిత-విగ్రహమ్ = విభూతిని వెలువరించుచున్న శరీరము గలవానిని, మృత్యుంజయమ్ = యముని జయించిన వానిని, లోకనాథమ్ = సర్వలోకములకు ప్రభువైన వానిని....

**తా :** ఓ శివా! నీవు సామగాన ప్రియుడవు, సర్వమయుడవు, నీ శరీరమునుండి విభూతి వెలువడుచుండును. నీవు యముని తిరస్కరించి మృత్యుంజయుడవైతివి, నీవు జగన్నాథుడవు, జగద్రక్షకుడవు. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రముతో పూజ చేయుచున్నాను.

**శ్లో॥ దారిద్ర్యదుఃఖహరణం రవిచన్ద్రానలేక్షణమ్ ।**
**మృగపాణిం చన్ద్రమౌళిమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 26**

**ప్ర :** శివ! = ఓ శివా!, దారిద్ర్యదుఃఖహరణమ్ = దారిద్ర్యమనెడి దుఃఖమును హరించు వానిని, రవి–చన్ద్ర + అనల + ఈక్షణమ్ = సూర్యుడు చంద్రుడు అగ్ని అనెడి కన్నులు గలవానిని, మృగపాణిమ్ = చేతియందు మృగమును ధరించిన వానిని, చన్ద్రమౌళిమ్ = శిరస్సునందు చంద్రుని ధరించిన వానిని....

**తా :** ఓ శివా! నీవు పేదరికమును, అందువలన కలిగెడి దుఃఖమును తొలగించెదవు. నీకు సూర్యుడును, చంద్రుడును, అగ్నియు మూడు కన్నులు. నీవు చేతియందు జింకను ధరించి యున్నావు. నీవు శిరస్సునందు చంద్రుని ధరించి యున్నావు. ఇట్టి నిన్ను భావన చేయుచు మారేడు దళముతో అర్చించుచున్నాను.

**శ్లో॥ సర్వలోకభయాకారం సర్వలోకైకసాక్షిణమ్ ।**
**నిర్మలం నిర్గుణాకారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 27**

**ప్ర :** సర్వలోకభయాకారమ్ = సర్వలోకములకు భయమును కలిగించు రూపము గలవానిని, సర్వలోక + ఏక–సాక్షిణమ్ = సర్వలోకములకు ఒకేయొక సాక్షియైన వానిని, నిర్మలమ్ = పరిశుద్ధుడైన వానిని, నిర్గుణ + ఆకారమ్ = నిర్గుణుడును నిరాకారుడు నైన వానిని....

**తా :** ఓ శివా! నీవు సర్వలోకములకు భీతి పుట్టించెడి రూపము గలవాడవు. సర్వలోకములకు ఏకైక సాక్షివి నీవు. నీలో ఏ విధమయిన కళంకమును లేదు. నిజమునకు నీవు గుణరహితుడవు. రూపరహితుడవు. (భక్తుల అభీష్టమును బట్టి ఆయా గుణములతో ఆయా రూపములతో దర్శనము దయచేసెదవు). అట్టి నిన్ను స్తోత్రము చేయుచు మారేడు పత్రమును సమర్పించి అర్చించుచున్నాను.

**శ్లో॥ సర్వతత్త్వాత్మకం సామ్బం సర్వతత్త్వవిదూరకమ్ ।**
**సర్వతత్త్వస్వరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 28**

**ప్ర :** సర్వతత్త్వాత్మకమ్ = సర్వతత్త్వములతో కలిసియున్న వానిని, స + అంబమ్ = పార్వతీసహితుడైన వానిని, సర్వతత్త్వవిదూరకమ్ = సర్వతత్త్వములను దూరముగా నిలుపువానిని, సర్వతత్త్వస్వరూపం చ = సర్వతత్త్వములకు రూపమై యున్న వానిని....

**తా :** ఓ శివా! సర్వతత్త్వములును నీ ఆత్మ స్వరూపమే. అంబాసహితుడవై నీవు సాంబశివుడవని కీర్తింపబడు చున్నావు. సర్వతత్త్వములకు నీవు దూరస్థుడవు. సర్వతత్త్వములయొక్క రూపమే నీవు. (భగవంతుడు '**తదంతికే తద్దూరే**' అని ఉపనిషత్తులందు పరస్పర విరుద్ధముగా చెప్పబడెను. '**యత్ర వాచో నివర్తన్తే మనసా సహ**' అని చెప్పుట అందువల్లనే) అట్టి నిన్ను భావించుచు మారేడు పత్రమును నీకు పూజా పత్రముగా సమర్పించెదను.

**శ్లో॥ సర్వలోకగురుం స్థాణుం సర్వలోకవరప్రదమ్ ।**
**సర్వలోకైకనేత్రం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 29**

**ప్ర :** సర్వలోకగురుమ్ = సమస్తలోకములకు గురుస్థానీయుని, స్థాణుమ్ = ఆదినుండి తుదివరకు స్థిరముగా నుండు వానిని, సర్వలోకవరప్రదమ్ = సమస్తలోకములకు వరములను ప్రసాదించు వానిని, సర్వలోక + ఏకనేత్రమ్ = సర్వలోకములకు ఒకే యొక దృష్టిగా పనిచేయు వానిని....

**తా :** సర్వలోకములకు గురుస్థానీయుడవై నీవే అంధకారము నుండి వెలుగులోనికి నడిపించు చున్నావు. చలనములేని స్థాణుడవు నీవు, ఆద్యంతములు లేని వాడవు. సర్వలోకములకు వరములను ప్రసాదించు వాడవు. నీవే సర్వలోకములకు దృష్టివై ముందునకు నడిపించు వాడవు. ఇట్టి నిన్ను స్తుతించుచు బిల్వదళముతో అర్చించు చున్నాను.

శ్లో॥ మన్మథోద్ధరణం శైవం భవభర్గం పరాత్మకమ్ ।
కమలాప్రియపూజ్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 30

**ప్ర :** మన్మథ + ఉద్ధరణమ్ = మన్మథుని ఉద్ధరించిన వానిని, శైవమ్ = మంగళకరుడైన వానిని, భవభర్గమ్ = జన్మబంధమును నశింప జేయు వానిని, పరాత్మకమ్ = ఉన్నతోన్నతుని, కమలాప్రియపూజ్యమ్ = లక్ష్మీదేవికి భర్తయైన విష్ణుదేవునికి పూజనీయుడైన వానిని ....

**తా :** ఓ శివా! నీవు మన్మథోద్ధారకుడవు. నీ యెడ ద్రోహము చేసినప్పుడు మన్మథుని దహించితివి. పార్వతీపరిణయానంతరము అతనిని అనంగునిగా బ్రతికించితివి. నీవు శైవుడవు. అనగా శుభములను కలిగించు వాడవు. భవబంధములను నశింపజేయు వాడవు నీవే. నీవే సర్వోన్నతుడవు. లక్ష్మీవల్లభుడైన విష్ణువునకు సైతము నీవు పూజనీయుడవు. అట్టి నిన్ను ధ్యానించుచు శివా! నీకు బిల్వపత్రము నొకదానిని సమర్పించుచున్నాను.

**శ్లో॥ తేజోమయం మహాభీమముమేశం భస్మలేపనమ్ ।**
**భవరోగవినాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 31**

**ప్ర :** తేజోమయమ్ = తేజోరూపమైన వానిని, మహాభీమమ్ = మిక్కిలి భయంకరమైన వానిని, ఉమా + ఈశమ్ = పార్వతీనాథుడైన వానిని, భస్మలేపనమ్ = విభూతిని మైపూతగా ధరించిన వానిని, భవరోగవినాశం చ = జన్మ మరణ రూపమైన సంసారరోగమును నాశనము చేయు వానిని....

**తా :** ఓ శివా! నీవు తేజోమయమైన శరీరము గలవాడవు. దుర్మార్గులకు మహాభయంకరుడవు. జగదంబయైన పార్వతికి వల్లభుడవు నీవు. విభూతినే మైపూతగా ధరించిన వాడవు. సంసారరూపమైన వ్యాధిని నశింపజేయువాడవు. అట్టి నిన్ను ధ్యానించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ స్వర్గాపవర్గఫలదం రఘునాథవరప్రదమ్ ।**
**నగరాజసుతాకాన్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 32**

**ప్ర :** స్వర్గ + అపవర్గ–ఫలదమ్ = స్వర్గమును ముక్తిని ఫలములుగా ఇచ్చు వానిని, రఘునాథవరప్రదమ్ = రఘువంశప్రభువైన రామునకు వరము నిచ్చిన వానిని, నగరాజసుతాకాన్తమ్ = పర్వతరాజ పుత్రికయైన పార్వతియొక్క భర్తను.....

**తా :** భోగభూమియైన స్వర్గమును, పునరావృత్తిరహితమైన మోక్షమును ప్రసాదించు వాడవు నీవు. రఘురామునికి రావణ విజయకారణమైన వరమును ప్రసాదించిన వాడవు నీవు. పర్వతరాజయిన హిమవంతుని పుత్రికయగు గౌరీదేవికి భర్తవు నీవు. శివా! ఇట్టి నిన్ను భావించుచు బిల్వపత్రముతో అర్చించుచున్నాను.

**శ్లో॥ మఞ్జీరపాదయుగళం శుభలక్షణలక్షితమ్ ।**
**ఫణిరాజవిరాజం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 33**

**ప్ర :** మఞ్జీరపాదయుగళమ్ = అందెలతో అలంకరింపబడిన రెండు పాదములు గలవానిని, శుభలక్షణలక్షితమ్ = మంగళాత్మకములయిన చిహ్నములతో గోచరించు వానిని, ఫణిరాజవిరాజమ్ = సర్పరాజములను అలంకారములుగా ధరించి విరాజిల్లు వానిని....

**తా :** ఓ శివా! నీ రెండు పాదములు మంజీర రంజితములై యున్నవి. నీ పేరునకు తగినట్లుగా మంగళకరములైన లక్షణములతో గోచరించు చున్నావు. నీవు అలంకారములుగా సర్పరాజములను ధరించి నాగభూషణుడవై ప్రకాశించు చున్నావు. అట్టి నిన్ను తలంచుచు మారేడాకు నొకదానిని పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ నిరామయం నిరాధారం నిస్సఙ్గం నిష్ప్రపఞ్చకమ్ ।**
**తేజోరూపం మహారౌద్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 34**

**ప్ర :** నిర్ + ఆమయమ్ = ఏవిధమైన వ్యాధులు లేని వానిని, నిర్ + ఆధారమ్ = ఏవిధమైన ఆలంబనమును లేనివానిని, నిః + సంగమ్ = ఏవిధమైన సాంగత్యము లేనివానిని, నిష్ప్రపఞ్చకమ్ = ప్రపంచమే లేని వానిని, తేజోరూపమ్ = కాంతిమయమైన శరీరము కలవానిని, మహారౌద్రమ్ = అత్యధికమైన రౌద్రము గలవానిని....

**తా :** ఓ శివా! నీవు నిరామయుడవు. నీవే సర్వవిశ్వమునకు ఆధారమగుటచేత నీకు ఆధారముగా చెప్పుకొనదగిన దేదియు లేదు. నీవు నిర్గుణ నిరాకారుడవైనప్పుడు జగదతీతుడవై యుందువు. అట్టి యెడ నీకు ప్రపంచము లేదు. నీవు కాంతిమయమైన శరీరము గలవాడవు. మహారుద్రరూపుడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రమును సమర్పించి పూజించుచున్నాను.

**శ్లో॥ సర్వలోకైకపితరం సర్వలోకైకమాతరమ్ ।**
**సర్వలోకైకనాథం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 35**

**ప్ర :** సర్వలోక + ఏకపితరమ్ = లోకములకన్నింటికి ఒకే యొక తండ్రియైన వానిని, సర్వలోక + ఏకమాతరమ్ = లోకముల కన్నింటికి ఒకే యొక తల్లియైన వానిని, చ = మరియు, సర్వలోక + ఏకనాథమ్ = లోకముల కన్నింటికి ఒకే యొక ప్రభువైన వానిని....

**తా :** ఓ శివా! సర్వలోకములకు నీవే తండ్రివి, నీవే తల్లివి, నీవే ప్రభుడవు. ఇట్టి నిన్ను సాక్షాత్కరించుకొని బిల్వపత్రముతో సమర్చించుచున్నాను.

శ్లో॥ చిత్రామ్బరం నిరాభాసం వృషభేశ్వరవాహనమ్ ।
నీలగ్రీవం చతుర్వక్త్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 36

ప్ర : చిత్ర + అంబరమ్ = చిత్రమైన వస్త్రము ధరించెడి వానిని, నిర్ + ఆభాసమ్ = ఆభాసము (భ్రాంతి) లేని వానిని, వృషభేశ్వరవాహనమ్ = నందీశ్వరుని వాహనముగా కల వానిని, నీలగ్రీవమ్ = నల్లని కంఠము గలవానిని, చతుర్ + వక్త్రమ్ = నాలుగు ముఖములు గల వానిని....

**తా :** నీవు చిత్రాంబరుడవు శివా! ఒకప్పుడు గజచర్మమును ధరింతువు. ఒకప్పుడు శార్దూలచర్మమును ధరింతువు. ఒకప్పుడు పట్టువస్త్రములను కూడ ధరింతువు. ఒకప్పుడు దిగంబరుడవై యుందువు. నీవు కన్నులు పట్టలేని కాంతి సంపద కలిగియుండుటచేత అగోచరుడవై యుందువు. నీకు నందీశ్వరుడు వాహనము. నంది యనగా ఆనందము గలవాడని అర్థము. అందువలన నీవు ఆనందమునే అధిరోహించి ఆనంద దాతవై విహరింతువు. నీ నల్లని కంఠము లోకక్షేమమునకై నీవు చేసిన సాహసమునకు గుర్తు. నీవు నాలుగు వక్త్రములు గలవాడవు. పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపములయిన నాలుగు వాక్కులకు నీవే మూల రూపము. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు పూజాపత్రమును సమర్పించి సమర్చించుచున్నాను.

**శ్లో॥ రత్నకఞ్చుకరత్నేశం రత్నకుణ్డలమణ్డితమ్ ।**
**నవరత్నకిరీటం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 37**

**ప్ర :** రత్నకఞ్చుకరత్నేశమ్ = రత్నములు పొదిగిన కవచము కలిగి రత్నములకు అధీశ్వరుడైన వానిని, రత్నకుణ్డలమణ్డితమ్ = రత్నములు పొదిగిన కర్ణాభరణములతో అలంకరింపబడిన వానిని, చ = మరియు, నవరత్నకిరీటమ్ = నవవిధ రత్నమయ మైన కిరీటము గల వానిని....

**తా :** ఓ శివా! నీవు రత్నేశ్వరుడవు. అందువలననే నీ అలంకారము లన్నియు రత్నమయములే. నీవు రత్నమయమైన కవచమును ధరింతువు, చెవులను రత్న మయములైన కుండలములతో అలకరించు కొందువు, **మౌక్తిక పద్మరాగ వజ్ర ప్రవాళ మరకత నీల గోమేధిక పుష్యరాగ వైదూర్య** నామకములైన నవరత్నములు తాపిన కిరీటమును ధరింతువు. ఓ శివా! ఇట్టి నిన్ను సాక్షాత్కరింప జేసికొని నీకు ప్రీతిపాత్రమైన బిల్వపత్రముతో నిన్ను పూజించుచున్నాను.

**శ్లో॥ దివ్యరత్నాఙ్గులీస్వర్ణకణ్ఠాభరణభూషితమ్ ।**
**నానారత్నమణిమయమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 38**

**ప్ర :** దివ్యరత్నాఙ్గులీ = ప్రకాశమానమైన రత్నమయమైన ఉంగరముతోను, స్వర్ణకణ్ఠాభరణ = బంగారు కంటెతోను, భూషితమ్ = అలంకరింప బడిన వానిని, నానారత్నమణిమయమ్ = అనేక రత్నములతోను మణులతోను కూడి యున్న వానిని....

**తా :** ఓ శివా! నీవు దివ్యరత్నమయమైన ఉంగరములతో అలంకరింపబడితివి. అట్లే సువర్ణమయమయిన కంఠహారముతో అలంకరింపబడితివి. అనేక విధములయిన రత్నములతోను, మణులతోను నిండి యున్నావు. ఇట్టి నీ సర్వ సంపన్నమైన రూపమును సంభావించుచు బిల్వపత్రముతో నిన్ను సమర్చించు చున్నాను.

శ్లో॥ రత్నాఙ్గులీయవిలసత్కరశాఖానఖప్రభమ్ ।
భక్తమానసగేహం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **39**

ప్ర : రత్నాఙ్గులీయవిలసత్ = రత్నములు పొదిగిన ఉంగరములతో ప్రకాశించు చున్న, కరశాఖానఖప్రభమ్ = చేతివ్రేళ్ల గోళ్ల యొక్క కాంతి గలవానిని, భక్తమానస–గేహమ్ = భక్తుల మనస్సులే నివాసస్థలమైన వానిని....

**తా :** ఓ శివా! నీ చేతి వ్రేళ్లు రత్నమయములైన ఉంగరములతో అలంకరింపబడి యున్నవి. అందువలన వ్రేళ్ల గోళ్లు మిక్కిలి కాంతిమంతములై ప్రకాశించుచున్నవి. నీవు కైలాసము నందుందువని, రజతగిరి యందుందువని, హిమాద్రి యందుందు వని భక్తులు భిన్న భిన్నరీతులలో వర్ణించిరి. నిన్ను నేను భక్తమనోవాసిగా దర్శించు చున్నాను. నీకు భక్తిపూర్వకముగా ఒక మారేడాకును సమర్పించుచున్నాను.

శ్లో॥ వామాఙ్గభాగవిలసదమ్బికావీక్షణప్రియమ్ ।
పుణ్డరీకనిభాక్షం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 40

ప్ర : వామాఙ్గభాగవిలసత్ = శరీరముయొక్క యెడమ భాగమునందు విలసిల్లు చున్న, అమ్బికావీక్షణప్రియమ్ = గౌరీదేవి చూపులందు మక్కువ కలవానిని, పుణ్డరీకనిభ + అక్షమ్ = పద్మముల వంటి కన్నులు గలవానిని....

**తా :** ఓ శివా! నీ వామభాగమునందు గౌరీదేవి విలసిల్లుచున్నది. ఆమె చూపులయందు నీవు మిక్కిలి ప్రేమను చూపు చున్నావు. నీ కన్నులు పద్మములవలె సుందరములై యున్నవి. ఇట్టి నిన్ను మనోలోచనముతో దర్శించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ సమ్పూర్ణకామదం సౌఖ్యం భక్తేష్టఫలకారణమ్ ।**
**సౌభాగ్యదం హితకరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 41**

**ప్ర :** శివ = ఓ శివా!, సమ్పూర్ణకామదం సౌఖ్యమ్ = సౌఖ్యమును కలిగించునట్లుగా సర్వవాంఛలను సమ్పూర్ణముగా నెరవేర్చు వానిని, భక్త + ఇష్టఫలకారణమ్ = భక్తులకు అభీష్టమైన ఫలమును అందించుటకు ఆధారమైన వానిని, సౌభాగ్యదమ్ = సౌభాగ్యము నొసగువానిని, హితకరమ్ = మేలు చేయువానిని....

**తా :** ఓ శివా! నీవు సౌఖ్యకరములయిన సర్వకాంక్షితములను తీర్చు చున్నావు. భక్తులు కోరిన ఫలములను తీర్చెడివాడవు నీవు. సౌభాగ్యమును కలిగించువాడవు నీవు. మేలును కలిగించువాడవు నీవు. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ నానాశాస్త్రగుణోపేతం స్ఫురన్మఙ్గళవిగ్రహమ్ ।**
**విద్యావిభేదరహితమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 42**

**ప్ర :** నానాశాస్త్ర = వివిధ శాస్త్రములందు చెప్పబడిన, గుణ + ఉపేతమ్ = గుణములతో కూడియున్న వానిని, స్ఫురత్ = ప్రకాశమానమయిన, మఙ్గళవిగ్రహమ్ = కల్యాణకరమయిన రూపము గలవానిని, విద్యావిభేదరహితమ్ = విద్య అవిద్య అనెడి భేదములు లేని వానిని....

**తా :** శివా! నీవు శాస్త్రములలో నిబంధింపబడిన సర్వసుగుణములను కలవాడవు. నీవు చక్కగా ప్రకాశించుచున్న మంగళకరమైన ఆకారము గలవాడవు. విద్య అవిద్య యనెడి భేదములు లేనివాడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వపత్రముతో పూజ చేయుచున్నాను.

**శ్లో॥ అప్రమేయగుణాధారం వేదకృద్రూపవిగ్రహమ్ ।**
**ధర్మాధర్మప్రవృత్తిం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥** **43**

**ప్ర :** అప్రమేయ = కొలుచుటకు వీలుకాని, గుణ + ఆధారమ్ = గుణములకు ఆశ్రయమైన వానిని, వేదకృత్ = వేదములచేత నిరూపింపబడిన, రూప = ఆకారముగల, విగ్రహమ్ = మూర్తిని గలవానిని, ధర్మ + అధర్మప్రవృత్తిమ్ = ధర్మప్రవృత్తి అని అధర్మప్రవృత్తి అని ప్రవర్తనమును రెండుగా విభజించిన వానిని....

**తా :** ఓ శివా! నీవు నిర్గుణుడ వైనప్పటికి అప్రమేయములయిన గుణములకు ఆధారమైన వాడవు. వేదమునందు నిరూపింపబడిన రూపమే నీ రూపము. ధర్మమని అధర్మమని ప్రవృత్తి రెండు విధములుకాగా ఆరెండింటికి ఆశ్రయమైన వాడవు నీవే. ఇట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రముతో సేవించుచున్నాను.

**శ్లో॥ గౌరీవిలాసవదనం జీవజీవపితామహమ్ ।**
**కల్పాన్తభైరవం శుభ్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 44**

**ప్ర :** గౌరీవిలాసవదనమ్ = పార్వతీదేవియొక్క తేజోమయ మైన ముఖమును గలవానిని, జీవ జీవ పితామహమ్ = జీవులకు ప్రాణమైన పితామహుడైన వానిని, కల్పాన్తభైరవమ్ = ప్రళయకాలమునందు భయంకరుడగు వానిని, శుభ్రమ్ = నిర్మలుడైన వానిని....

**తా :** ఓ శివా! నీవు పార్వతీదేవిముఖమును విలసిల్లునట్లుగా చేయుచున్నావు. నీవు జీవులకు జీవభూతుడవు. అందువల్లనే సర్వజీవులకు ఆదిపురుషుడవై పితామహుడవగు చున్నావు. నీవు ప్రళయాధిపతివి. నీవు ప్రళయకాలమును కల్పింతువు. అట్టి సమయమున నీవు భయంకరుడవై ఉగ్రుడవై యుందువు. అయినను నీవు స్వచ్ఛస్వరూపుడవు. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రముతో పూజించుచున్నాను.

**శ్లో॥ సుఖదం సుఖనాశం చ దుఃఖదం దుఃఖనాశనమ్ ।**
**దుఃఖావతారం భద్రం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 45**

**ప్ర :** సుఖదమ్ = సుఖములను కలిగించు వానిని, సుఖనాశనమ్ = సుఖములను నాశనము చేయువానిని, దుఃఖదమ్ = దుఃఖములను కలిగించు వానిని, దుఃఖనాశనమ్ = దుఃఖములను నాశనము చేయువానిని, దుఃఖ + అవతారమ్ = దుఃఖరూపముగా అవతరించు వానిని, భద్రమ్ = శ్రేయమును రూపముగా ధరించిన వానిని....

**తా :** ఓ శివా! సుఖదుఃఖములు నీ అధీనములు. సుఖములు కలుగుటకు నీవే కారణము. దుఃఖములు కలుగుటకును నీవే కారణము. అట్లే సుఖములు కలుగుటకు నీవే కారణము, సుఖనాశనమునకు సైతము నీవే కారణము. నీవు దుఃఖరూపముగా అవతరింతువు, అట్లే శ్రేయోరూపముగాను అవతరింతువు. సుఖదుఃఖము లనెడి ద్వంద్వములను కలిగించుటకు తొలగించుటకు నీవే సమర్థుడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రముతో అర్చించుచున్నాను.

**శ్లో॥ సుఖరూపం రూపనాశం సర్వధర్మఫలప్రదమ్ ।**
**అతీన్ద్రియం మహామాయమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 46**

**ప్ర :** సుఖరూపమ్ = సుఖమునకు ఆకారమైన వానిని, రూపనాశమ్ = రూపరహితత్వము కలిగించు వానిని, సర్వధర్మఫలప్రదమ్ = అన్ని ధర్మములకు నిర్దేశింపబడిన ఫలితములను ప్రసాదించు వానిని, అతి + ఇన్ద్రియమ్ = ఇంద్రియములకు అతీతమైన వానిని, మహామాయమ్ = గొప్ప మాయను గల కలవానిని....

**తా :** ఓ శివా! నీవు సుఖరూపుడవు. శివనామధేయముచేతనే యీ విషయము వెల్లడియగు చున్నది. అట్లయ్యును నీవు రూపరహితుడవు. అందువల్లనే నీ భక్తులకు సైతము శారీరక వ్యామోహమును నశింపజేసెదవు. వేర్వేరు ధర్మములకు వేర్వేరు ఫలము లుండును. ఫలదాతలు కూడా వేర్వేరుగా నుందురు. ఇది సాధారణ విషయము. నీ విషయము వేరు. నీవు సర్వేశ్వరుడవగుటచేత సర్వధర్మముల యొక్క ఫలితములను నీవే ప్రసాదింతువు. నీవు ఇంద్రియములకు అతీతుడవు. (**యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ**) వాక్కులు గాని మనస్సుగాని నిన్ను చేర జాలవు. నీవు మాయాధరుడవు. అందువల్లనే నిన్ను ప్రత్యక్షముగా చూచుచున్నట్లే అనిపింతువు గాని అగోచరుడవై యుందువు. **తదంతికే తద్దూరే** అన్నది నిన్ను గురించియే. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వార్చనము చేయుచున్నాను.

శ్లో॥ సర్వపక్షిమృగాకారం సర్వపక్షిమృగాధిపమ్ ।
సర్వపక్షిమృగాధారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **47**

**ప్ర :** సర్వపక్షి – మృగ + ఆకారమ్ = సర్వపక్షులయొక్కయు, జంతువుల యొక్కయు ఆకారము గలవానిని, సర్వపక్షిమృగాధిపమ్ = సర్వపక్షులకు జంతువులకు అధిపతియైన వానిని, సర్వపక్షిమృగాధారమ్ = సర్వపక్షులకు మృగములకు ఆధారమైన వానిని....

**తా :** ఓ శివా! కనులకు గోచరించు సృష్టి యంతయు నీ రూపము. సృష్టియందలి జంగమస్థావరము లన్నియు నీరూపమే. పశువులేమి, పక్షులేమి అన్నియు నీరూపమే. ఈ రూపము నీదే యగుటచేత నీవే దీనికి అధిపతివి. నీదైన యీ సృష్టికి ఆధారభూతుడవై నిలబెట్టువాడవు నీవే. (**ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై ఎవ్వని యందు డిందు పరమేశ్వరుడెవ్వడు...**) అట్టి నిన్ను ధ్యానించుచు బిల్వపత్త్రార్పణముతో అర్చించుచున్నాను.

శ్లో॥ జీవాధ్యక్షం జీవవన్ద్యం జీవజీవనరక్షకమ్ ।
జీవకృజ్జీవహరణమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 48

ప్ర : జీవ + అధ్యక్షమ్ = ప్రాణులకు అధిపతియైన వానిని, జీవవన్ద్యమ్ = ప్రాణులకు వందనీయుడైన వానిని, జీవజీవనరక్షకమ్ = జీవులయొక్క ప్రాణములకు రక్షణ కలిగించు వానిని, జీవకృత్ + జీవహరణమ్ = ప్రాణులను ఖండించు వారి ప్రాణములను తీయువానిని....

తా : ఓ శివా! సర్వజీవులకు అధిపతివి నీవు. సర్వజీవులకు వందనీయుడవు నీవు. జీవులయొక్క ప్రాణములను రక్షించు వాడవు నీవు. జీవులకు హాని కలిగించు వారి ప్రాణములను నశింపజేయువాడవు నీవు. అట్టి నిన్ను స్మరించుచు నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ విశ్వాత్మానం విశ్వవన్ద్యం వజ్రాత్మం వజ్రహస్తకమ్ ।**
**వజ్రేశం వజ్రభూషం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 49**

**ప్ర :** విశ్వ + ఆత్మానమ్ = విశ్వమునకు ఆత్మయైన వానిని, విశ్వవన్ద్యమ్ = విశ్వముచేత నమస్కరింపబడు వానిని, వజ్రాత్మమ్ = వజ్రమువలె దృఢమైన ఆత్మగలవానిని, వజ్రహస్తకమ్ = వజ్రములను హస్తములందు గలవానిని, వజ్రేశమ్ = వజ్రములకు అధిపతియైన వానిని, వజ్రభూషమ్ = వజ్రమయములయిన అలంకారములను గలవానిని....

**తా :** ఓ శివా! నీవు విశ్వమునకు ఆత్మవు. నీవలననే విశ్వము చైతన్యవంతమై యున్నది. సర్వవిశ్వము నీకు నమస్కరించుచున్నది. నీవు వజ్రసన్నిభమైన ఆత్మగలవాడవు. నీచేతుల యందు వజ్రము లున్నవి. నీవు వజ్రములకు అధిపతివి. నీవు వజ్రమయములయిన నగలను ధరించి యున్నావు. అట్టి ఐశ్వర్యసంపన్నుడవైన నిన్ను సన్నుతించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

శ్లో॥ గణాధిపం గణాధ్యక్షం ప్రళయానలనాశకమ్ ।
జితేన్ద్రియం వీరభద్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **50**

**ప్ర :** గణాధిపమ్ = గణములకు అధిపతియైన వానిని, గణాధ్యక్షమ్ = గణములకు అధ్యక్షుడైన వానిని, ప్రళయానలనాశకమ్ = ప్రళయాగ్నివలె నాశనము చేయువానిని, జితేన్ద్రియమ్ = ఇంద్రియములను జయించిన వానిని, వీరభద్రమ్ = వీరులకు భద్రతను కలిగించువానిని (వీరభద్రుడను పేరు గలవానిని)....

**తా :** ఓ శివా! నీవు దేవగణములకు అధిపతివి. భూతపిశాచాది గణములకు అధ్యక్షుడవు. ప్రళయకాలమునందలి అగ్నివలె సర్వమును నాశనము చేయువాడవు. ఇంద్రియజయమును సాధించిన వాడవు. వీరభద్రరూపమున విజృంభించిన వాడవు కూడ నీవే. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రముతో అర్చించుచున్నాను.

**శ్లో॥ త్ర్యమ్బకం మృడం శూరం చ హ్యరిషడ్వర్గనాశనమ్ ।**
**దిగమ్బరం క్షోభనాశమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 51**

**ప్ర :** త్రి + అమ్బకమ్ = మూడు కన్నులు గలవానిని, మృడమ్ = భక్తులకు సుఖమును కలిగించు వానిని, శూరమ్ = శౌర్యము గలవానిని, అరిషడ్వర్గనాశకమ్ = కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడి శత్రువుల నారింటిని నాశనము పొందించు వానిని, దిగమ్బరమ్ = దిక్కులే వస్త్రముగా గలవానిని, క్షోభనాశమ్ = కలతను నశింపజేయు వానిని....

**తా :** ఓ శివా! నీవు సూర్యచంద్రాగ్నులను మూడు నేత్రములు గలవాడవు. మృదు డన్న నామధేయము గలవాడవు. త్రిపురాసురాదులను సంహరించిన శూరుడవు. శత్రువర్గమైన కామాదులను నాశనము చేయువాడవు. నీవు విశ్వవ్యాప్తమైన మూర్తి గలవాడవు కనుక దిక్కులే నీకు వస్త్రములుగా ఉపచరించుచున్నవి. ప్రపంచము నందలి సంక్షోభమును నాశనము పొందించు వాడవు నీవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ కున్దేన్దుశఙ్ఖధవళం త్రిభిరక్షిభిరుజ్జ్వలమ్ ।**
**కాలాగ్నిరుద్రం సర్వజ్ఞమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 52**

**ప్ర :** కుంద + ఇందు + శఙ్ఖ ధవళమ్ = మొల్లవలె, చంద్రునివలె, శంఖమువలె తెల్లని వర్ణముగల వానిని, త్రిభిః + అక్షిభిః + ఉజ్జ్వలమ్ = మూడు కన్నుల చేతను ప్రకాశించు వానిని, కాలాగ్నిరుద్రమ్ = ప్రళయకాలమునందలి అగ్నివలె భయంకరమైన వానిని, సర్వజ్ఞమ్ = సర్వమును ఎరిగిన వానిని....

**తా :** ఓ శివా! నీవు ధవళవర్ణము గలవాడవు. నీ శరీరము మొల్లవలె, చంద్రునివలె, శంఖమువలె తెల్లని వన్నె కలిగి శోభించుచున్నది. నీ వదనము త్రినేత్రపరిశోభితమై ప్రకాశించుచున్నది. నీవు ప్రళయాగ్నివలె భయమును గొల్పుచున్నావు. నీవు భూతభవిష్యద్వర్తమానములను తెలిసిన వాడవు. అట్టి నిన్ను సన్నుతించుచు పూజా పత్రముగా నీకు ప్రియమైన బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

శ్లో॥ కమ్బుగ్రీవం కమ్బుకణ్ఠం ధైర్యదం ధైర్యవర్ధకమ్ ।
శార్దూలచర్మవసనమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **53**

**ప్ర :** కమ్బుగ్రీవమ్ = శంఖమువంటి మెడగలవానిని, (మూడు ముడుతలు గల మెడగలవానిని), కమ్బుకణ్ఠమ్ = శంఖధ్వనివంటి ధ్వని గల కంఠము గలవానిని, ధైర్యదమ్ = ధైర్యమును గల్పించువానిని, ధైర్యవర్ధకమ్ = ధీరత్వమును వృద్ధి పొందించు వానిని, శార్దూలచర్మవసనమ్ = పులిచర్మమును వస్త్రముగా ధరించు వానిని....

**తా :** ఓ శివా! నీ మెడ మూడు ముడుతలు గలిగి శంఖముతో సామ్యమును గలిగియున్నది. నీ కంఠధ్వని శంఖధ్వనిని పురుడించుచున్నది. నీవు నీ భక్తులకు ధైర్యమును ప్రసాదింతువు. ధైర్యమును వృద్ధిపొందింతువు. నీవు శార్దూలచర్మమును వస్త్రముగా ధరింతువు. అట్టి నిన్ను సన్నుతించుచు ఒక బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి అర్చించుచున్నాను.

శ్లో॥ జగదుత్పత్తిహేతుం చ జగత్ప్రళయకారణమ్ ।
పూర్ణానన్దస్వరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **54**

**ప్ర :** జగత్ + ఉత్పత్తిహేతుమ్ = ప్రపంచముయొక్క పుట్టుకకు కారణమైనవానిని, జగత్ప్రళయకారణమ్ = ప్రపంచముయొక్క నాశనమునకు కారణమైన వానిని, పూర్ణానన్దస్వరూపమ్ = పరిపూర్ణమైన ఆనందమే స్వరూపముగా నున్న వానిని....

**తా :** ఓ శివా! సర్వజగత్తు నీ వల్లనే జనించుచున్నది. అట్లే జగత్తు సర్వము నీ వల్లనే లయము నొందుచున్నది. మూర్తి దాల్చిన పూర్ణానందమే నీవు. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రముతో పూజించుచున్నాను.

**శ్లో॥ సర్గకేశం మహత్తేజం పుణ్యశ్రవణకీర్తనమ్ ।**
**బ్రహ్మాణ్డనాయకం తారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 55**

**ప్ర :** సర్గకేశమ్ = సృష్టి చేయగల వెంట్రుకలు గల వానిని, మహత్తేజమ్ = గొప్పకాంతిని గలవానిని, పుణ్యశ్రవణకీర్తనమ్ = పుణ్యవిషయములను వినుట కీర్తించుట కలవానిని, బ్రహ్మాణ్డనాయకమ్ = సర్వవిశ్వమునకు అధిపతియై నడిపించు వానిని....

**తా :** ఓ శివా! దక్షాధ్వరధ్వంసమునకై నీవు నీ శిరోజమును పెరికి వీరభద్రుని సృజించితివి. నీవు గొప్ప కాంతిని పరాక్రమమును గలవాడవు. నీవు నీ భక్తుల పుణ్యగాథలను విందువు. అట్లే ఆయా పుణ్యగాథలను కీర్తింతువు. సర్వవిశ్వమునకు అధినాయకుడవు. సర్వవిశ్వమును నడిపించు వాడవు నీవే. అట్టి నిన్ను స్తుతించి బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి అర్చించుచున్నాను.

శ్లో॥ మన్దారమూలనిలయం మన్దారకుసుమప్రియమ్ ।
బృన్దారకప్రియతరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **56**

**ప్ర :** మన్దారమూలనిలయమ్ = మందారవృక్షమూలమే నెలవుగా గలవానిని, మందారకుసుమప్రియమ్ = మందారపుష్పములందు ప్రీతిగల వానిని, బృన్దారక-ప్రియతరమ్ = దేవతలకు మిక్కిలి యిష్టుడైన వానిని....

**తా :** ఓ శివా! మందారవృక్షమూలమే నీ నివాసస్థానము. మందారపుష్పములన్న నీకు మిక్కిలి యిష్టము. దేవతలకు నీవు మిక్కిలి యిష్టుడవు. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రముతో నీకు పూజ చేయుచున్నాను.

**శ్లో॥ మహేన్ద్రియం మహాబాహుం విశ్వాసపరిపూరకమ్ ।**
**సులభాసులభం లభ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 57**

**ప్ర :** మహా + ఇన్ద్రియమ్ = గొప్ప యింద్రియములను కలిగిన వానిని, మహాబాహుమ్ = గొప్ప బాహువులను కలిగిన వానిని, విశ్వాసపరిపూరకమ్ = నమ్మకమును నింపు వానిని, సులభ + అసులభమ్ = తేలికగా లభించు వాడయ్యును కష్టముగా లభించు వానిని, లభ్యమ్ = లభించెడి వానిని....

**తా :** ఓ శివా! నీకు పంచభూతములు, సూర్యచంద్రులు, యాజ్ఞికుడు అను ఎనిమిది అవయవములు గలవు. ఆ విధముగా నీవు అష్టమూర్తిగా మహేంద్రియునిగా కీర్తి నొందితివి. నీవు సుదీర్ఘబాహువులు కలవాడవు. మనుజు లందు భగవద్విశ్వాసమును నింపువాడవు నీవే. నీవు సులభముగానే లభింతువు. అందువల్లనే నీకు **ఆశుతోషు**డని, **ఉబ్బులింగ**డని వ్యవహారము గలదు. అట్లే అయినను నీవు కష్టముమీద గాని లభింపవు. ఎట్లయినను నీవు తప్పక పొందదగినవాడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రసమర్పణముతో సమర్చించుచున్నాను.

**శ్లో॥ బీజాధారం బీజరూపం నిర్బీజం బీజవృద్ధిదమ్ ।**
**పరేశం బీజనాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 58**

**ప్ర :** బీజ + ఆధారమ్ = సృష్టిబీజమునకు ఆధారమైన వానిని, బీజరూపమ్ = బీజముయొక్క రూపమే తన రూపమైన వానిని, నిర్ + బీజమ్ = తనకంటె ఇతర బీజములు లేని వానిని, బీజవృద్ధిదమ్ = బీజములకు వృద్ధిని కలిగించు వానిని, పరేశమ్ = ఉన్నతోన్నతప్రభువును, బీజనాశమ్ = విత్తనములను నశింపజేయు వానిని....

**తా :** ఓ శివా! నీవు భవుడవు. సృష్టికి మూలమైన బీజమునకు ఆధారము నీవే. నీవు నీ సృష్టియొక్క ఆకారము కలవాడవు. అందువల్లనే నిన్ను విశ్వరూపునిగా గానము చేయుచున్నారు. నీవు నిర్బీజుడవు. నీవు తప్ప మఱియే విత్తనములును విశ్వసృష్టికి లేనివాడవు. నీ వొక్కడవే అయినను విత్తనములకు వృద్ధిని కలిగించి జగద్వ్యాప్తికి తోడ్పడువాడవు నీవే. నీవే పరాత్పరుడవు. లయకారుడవు కూడా నీవే. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రము నొక దానిని పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ యుగాకారం యుగాధీశం యుగకృద్యుగనాశకమ్ ।**
**పరేశం బీజనాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 59**

**ప్ర :** యుగ + ఆకారమ్ = కాలస్వరూపుడైన వానిని, యుగ + అధీశమ్ = కాలమునకు అధిపతియైన వానిని, యుగకృత్ = యుగములను నిర్మించు వానిని, యుగనాశకమ్ = యుగములను నశింపజేయువానిని (ఉత్తరార్ధము పునరుక్తము)....

**తా :** ఓ శివా! నీవు కాలస్వరూపుడవు. కాలమునకు అధిపతివి సైతము నీవే. కాలమును విభజించి యుగములుగా నియమించు వాడవు నీవే. యుగములను నాశనము చేయువాడవు కూడ నీవే. మొత్తము మీద కర్తవు, హర్తవు, భర్తవు నీవే. అట్టి సర్వప్రభుడవైన నిన్ను స్తోత్రము చేయుచు బిల్వపత్రముతో సమర్చించు చున్నాను.

**శ్లో॥ ధూర్జటిం పిఙ్గళజటం జటామణ్డలమణ్డితమ్ ।**
**కర్పూరగౌరం గౌరీశమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 60**

**ప్ర :** ధూర్ + జటిమ్ = భారభూతములై జడలు గలవానిని, పిఙ్గళజటమ్ = గోరోచనవర్ణముగల జడలు గలవానిని, జటామణ్డలమణ్డితమ్ = జడల సమూహముచేత అలంకరింపబడిన వానిని, కర్పూరగౌరమ్ = కర్పూరమువలె ధవళవర్ణముగల వానిని, గౌరీ + ఈశమ్ = పార్వతీవల్లభుని....

**తా :** ఓ శివా! నీవు బరువైన జడలను గలవాడవు. నీ జడలు ఎఱ్ఱని రంగు గలవి. ఆ జడల సమూహము నీ శిరమునకు అలంకారమై అలరించుచున్నది. నీవు కర్పూర– సన్నిభమైన తెల్లనివన్నె కలవాడవు. ఓ పార్వతీప్రాణనాయకా! నిన్ను సన్నుతించుచు నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ సురావాసం జనావాసం యోగీశం యోగిపుఙ్గవమ్ ।**
**యోగదం యోగినాం సింహమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 61**

**ప్ర :** సుర + ఆవాసమ్ = దేవతలను నెలవుగా కలవానిని (దేవతలకు నెలవైన వానిని), జన + ఆవాసమ్ = ప్రజలను నెలవుగా కలవానిని ( ప్రజలకు నెలవైన వానిని), యోగి + ఈశమ్ = యోగులకు ప్రభువైన వానిని, యోగిపుఙ్గవమ్ = యోగులలో శ్రేష్ఠుని, యోగదమ్ = యోగమును ప్రసాదించు వానిని, యోగినాం సింహమ్ = యోగులకు సింహము వంటి వానిని....

**తా :** ఓ శివా! దేవతలును ప్రజలును నిన్నే తమ ఆవాసస్థానముగా చేసికొని యున్నారు. అట్లే దేవతలను ప్రజలను నీవు నీ నివాసస్థానముగా చేసికొని యున్నావు. నీవు సర్వయోగులను మించి వాడవగుటచేత భక్తులు నిన్ను యోగీశ్వరునిగా, యోగిపుంగవునిగా, యోగిసింహముగా సంబోధించుచున్నారు. యోగవిద్యను అనుగ్రహించు వాడవు కూడ నీవే. అట్టి నిన్ను బిల్వపత్ర సమర్పణముతో సేవించు చున్నాను.

**శ్లో॥ ఉత్తమానుత్తమం తత్త్వమన్ధకాసురసూదనమ్ ।**
**భక్తకల్పద్రుమస్తోమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 62**

**ప్ర :** ఉత్తమ + అనుత్తమమ్ = ఉత్తముడును అనుత్తముడునునైన వానిని (అనుత్తము డనగా ఉత్తమోత్తముడని యర్థము), తత్ + త్వమ్ = తత్ శబ్దము యొక్క స్వభావమైన వానిని, అన్ధకాసురసూదనమ్ = అంధకుడనే రాక్షసుని సంహరించిన వానిని, భక్తకల్పద్రుమస్తోమమ్ = భక్తులకు కల్పద్రుమ సమూహముగా అయినవానిని....

**తా :** ఓ శివా! నీవు శ్రేష్ఠుడవు. అంతేకాదు నీకంటే శ్రేష్ఠులైనవారు ఎవరును లేరు. అందువల్లనే నిన్ను ఉత్తమునిగా అనుత్తమునిగా భక్తులు సంభావించు చున్నారు. '**ఓం తత్ సత్**' అన్న మంత్రము నందలి తత్ శబ్దము యొక్క అర్థమే నీవు. అంధకుడనే రాక్షసుని సంహరించిన వాడవు నీవు. భక్తుల పాలిటికి కల్పవృక్షముల సమూహమవై కోరిన కోరికల నన్నింటిని తీర్చువాడవు నీవు. అట్టి నిన్ను స్తుతించుచు మారేడు పత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

శ్లో॥ విచిత్రమాల్యవసనం దివ్యచన్దనచర్చితమ్ ।
విష్ణుబ్రహ్మాదివన్ద్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **63**

**ప్ర :** విచిత్ర – మాల్య – వసనమ్ = చిత్రచిత్రములైన హారములను వస్త్రములను ధరించిన వానిని, దివ్య–చన్దన–చర్చితమ్ = దేవతా సంబంధమైన గంధముతో అలంకరింపబడిన వానిని, విష్ణుబ్రహ్మాదివన్ద్యమ్ = విష్ణువు, బ్రహ్మ మొదలయిన వారిచేత పూజింపబడు వానిని....

**తా :** ఓ శివా! నీవు చిత్రచిత్రములైన హారములను ధరింతువు. ఒకప్పుడు నాగరాజు నీ కంఠహారమై యుండును. ఒకప్పుడు కపాలమాల నీ గళము నలంకరించి శబ్దించుచుండును. ఒకప్పుడు మందారమాలలతో నీ కంఠము సొగసు లీను–చుండును. అట్లే నీవు ధరించు వస్త్రములు కూడ ఆశ్చర్యజనకములై యుండును. ఒకప్పుడు రక్తబిందువుల నోడుచున్న గజచర్మమును ధరింతువు. ఒకప్పుడు దుకూల–ధారివై యుందువు. ఒకప్పుడు దిక్కులే వస్త్రము కాగా దిగంబరుడవై యుందువు. ఇంకను నీవు ధరించు హారములు, వస్త్రములు ఎన్నో విధములుగా నుండవచ్చును. నీ శరీరము భస్మలేపనమును పొంది యుండుట ప్రసిద్ధమే. కాని దివ్యమైన చందనము కూడా నీ శరీరమునకు పూతయై సువాసనలను గుబాళించు చుండును. విష్ణువు బ్రహ్మ మొదలయిన లోకవంద్యులు కూడ నీకు వందనములు సల్పుచున్నారు. అట్టి నిన్ను ధ్యానించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించు–చున్నాను.

**శ్లో॥ కుమారపితరం దేవం సితచన్ద్రకళాధరమ్ ।**
**బ్రహ్మశత్రుం జగన్మిత్రమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 64**

**ప్ర :** కుమారపితరమ్ = కుమారస్వామియొక్క తండ్రిని, దేవమ్ = భగవంతుని, సితచన్ద్రకళాధరమ్ = తెల్లని చంద్రరేఖను ధరించిన వానిని, బ్రహ్మశత్రుమ్ = బ్రహ్మకు శత్రువైన వానిని, జగత్ + మిత్రమ్ = లోకమునకు స్నేహితుడైన వానిని....

**తా :** ఓ శివా! దేవతలకు సేనాధిపతియై తారకాసురసంహారకుడైన కుమారస్వామిని కన్న తండ్రివి నీవు. నీవు దేవదేవుడవు. తెల్లని చంద్రకళను నీవు నీ జటాజూటము నందు ధరించి యున్నావు. బ్రహ్మకు అయిదు శిరస్సులుండగా ఆయన చేసిన అపరాధమునకు పరిహారముగా శత్రుడవైనట్లు అతని శిరస్సు నొకదానిని ఖండించి వేసితివి. అప్పటినుండియు బ్రహ్మ చతుర్ముఖుడయ్యెను. నీవు సర్వలోకములకు మిత్రుడవు. సముద్రమథనకాలమున అతిభయంకరమైన హాలాహలవిషము జనింపగా దానిని మ్రింగి సదసద్వర్గములయిన దేవ రాక్షస జాతులనేకాక సర్వలోకములను కాపాడి సర్వలోకములకు మిత్రుడవైతివి. అట్టి నీకు బిల్వపత్రమును సమర్పించి అర్చించుచున్నాను.

**శ్లో॥ లావణ్యమధురాకారం కరుణారసవారిధిమ్ ।**
**భ్రువోర్మధ్యేసహస్రార్చిమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 65**

**ప్ర :** లావణ్య-మధుర + ఆకారమ్ = స్నిగ్ధత గల మధురమయిన రూపముగల వానిని, కరుణారసవారిధిమ్ = దయా రసమునకు సముద్రమైన వానిని, భ్రువోః + మధ్యే-సహస్రార్చిమ్ = రెండు కనురెప్పల మధ్య అగ్నిని కలవానిని....

**తా :** ఓ శివా! నీవు సుస్నిగ్ధమైన మధురాతి మధురమైన రూపము గలవాడవు. దయారసమునకు నీవు అపారమైన సముద్రమువంటి వాడవు. నీ కనురెప్పల మధ్యదేశమునందు, అనగా లలాటమునందు అగ్నినేత్రము కలవాడవు. అట్టి నిన్ను సన్నుతించుచు పూజాపత్రముగా బిల్వపత్రమును నీకు సమర్పించుచున్నాను.

శ్లో॥ జటాధరం పావకాక్షమృక్షేశం భూమినాయకమ్ ।
కామదం సర్వదా గమ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **66**

**ప్ర :** జటాధరమ్ = జడలు ధరించిన వానిని, పావక + అక్షమ్ = అగ్నియే నేత్రముగా కలవానిని, ఋక్ష + ఈశమ్ = నక్షత్రాధిపతిని కలవానిని, భూమి నాయకమ్ = సమస్తభూమికి నాయకుని, కామదమ్ = కోరికలను తీర్చేవాడిని, సర్వదా గమ్యమ్ = ఏ సమయమందైనను చేరదగినవానిని....

**తా :** ఓ శివా! నీవు జటాజూటమును ధరించువాడవు. నొసట అగ్నినేత్రమును ధరించిన వాడవు. జటాజూటములో తారాధీశుడైన చంద్రుని ధరించి యున్నావు. సర్వ విశ్వమునకు నాయకుడవు నీవు. నీవే సర్వవిశ్వమును నడిపించుచున్న వాడవు. భక్తుల కోరికలను ప్రసాదించు వాడవు నీవు. ఎల్లప్పుడును చేరుటకు వీలయినవాడవు నీవు. సర్వసులభుడవు. సర్వదా సులభుడవు. అట్టి నిన్ను సంభావించుచు బిల్వపత్రసమర్పణముతో సమర్పించుచున్నాను.

**శ్లో॥ శివం శాన్తముమానాథం మహాధ్యానపరాయణమ్ ।**
**జ్ఞానప్రదం కృత్తివాసమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 67**

**ప్ర :** శివమ్ = శుభమును ప్రసాదించు వానిని, శాంతమ్ = శాంతిని ప్రసాదించు వానిని, ఉమానాథమ్ = పార్వతీపతిని, మహాధ్యానపరాయణమ్ = మహాధ్యాన మందు నిమగ్నుడై యున్నవానిని, జ్ఞానప్రదమ్ = జ్ఞానమును ప్రసాదించు వానిని, కృత్తివాసమ్ = చర్మమును వస్త్రముగా ధరించిన వానిని....

**తా :** ఓ శివా! నీవు శివమూర్తివి, శాంతమూర్తివి, జ్ఞానమూర్తివి. అందువల్ల నిన్ను ఆశ్రయించిన భక్తులకు శుభములను ప్రసాదింతువు. శాంతిని ప్రసాదింతువు. నీవు పార్వతీపతివి. మహాధ్యానమునందు పరాకాష్ఠ నందుకొన్నవాడవు. చర్మమునే వస్త్రముగా ధరించిన వాడవు నీవు. అట్టి నిన్ను సన్నుతించుచు మారేడాకుతో నీకు పూజ చేయుచున్నాను.

**శ్లో॥ వాసుక్యురగహారం చ లోకానుగ్రహకారణమ్ ।**
**జ్ఞానప్రదం కృత్తివాసమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 68**

**ప్ర :** వాసుకి + ఉరగహారమ్ = వాసుకి అనెడి సర్పమును కంఠహారముగా ధరించిన వానిని, చ = మరియు, లోక + అనుగ్రహకారణమ్ = ప్రజలయెడల కరుణ చూపుటకు ఆశ్రయమైన వానిని (ఉత్తరార్ధము పునరుక్తము)....

**తా :** ఓ శివా! నీ మెడయందు వాసుకి అనెడి సర్పరాజు హారాలంకారమై యున్నాడు. అనుగ్రహమనెడి కార్యమునకు కారణమైనవాడవు నీవు. నీ వలననే లోకము అనుగ్రహభాగ్యమును పొందుచున్నది. జ్ఞాననిధివి నీవు. కావుననే జీవులకు జ్ఞానము ననుగ్రహింతువు. చర్మమునే వస్త్రముగా ధరించుటచేత నీ నిరాడంబరత్వము అనుగ్రహమహత్త్వము వెల్లడి యగుచున్నది. అట్టి నిన్ను సన్నుతించుచు మారేడుదళముతో నీకు పూజ చేయుచున్నాను.

**శ్లో॥ శశాఙ్కధారిణం భర్గం సర్వలోకైకశఙ్కరమ్ ।**
**శుద్ధం చ శాశ్వతం నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 69**

**ప్ర :** శశాఙ్కధారిణమ్ = చంద్రుని ధరించిన వానిని, భర్గమ్ = కామకాలాదులను నాశనము చేసిన వానిని, సర్వలోకైకశఙ్కరమ్ = లోకముల కన్నింటికి శుభములను కలిగించు వానిని, శుద్ధమ్ = నిర్మలుని, చ = మరియు, శాశ్వతమ్ = ఎల్లప్పుడు నుండువానిని, నిత్యమ్ = నియమపూర్వకముగా నుండు వానిని....

**తా :** ఓ శివా! నీ శిరస్సున నీవు చంద్రుని ధరించి యున్నావు. కాముడు కాలుడు మొదలయిన వారిని దండించిన వాడవు. ఒకప్పుడు దండించుటచేత ఇప్పటికిని, ఎప్పటికిని దండింపగలవాడవు. సర్వలోకములకు ఏకైక శుభప్రదాతవు నీవే. నీవు స్వచ్ఛమైన వాడవు. సృష్టికి పూర్వము నీవుంటివి, సృష్ట్యనంతరము నీవున్నావు. సృష్టి లయము నొందిన పిమ్మట కూడ నీవుందువు. కావుననే నీవు శాశ్వతుడవు. అంతేకాదు. నీవు నియమపూర్వకముగా నుండుటచేత నిత్యుడవు కూడ. అట్టి నిన్ను సన్నుతి సేసి బిల్వపత్రముతో సేవించుచున్నాను.

శ్లో॥ శరణాగతి–దీనార్థి–పరిత్రాణ–పరాయణమ్ ।
గమ్భీరం చ వషట్కారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **70**

**ప్ర :** శరణ + ఆగతి = శరణు చొచ్చిన వారిని, దీన = దయనీయులను, అర్థి = యాచకులను, పరిత్రాణ = రక్షించుట యందు, పరాయణమ్ = పరమాసక్తిని గలిగిన వానిని, గమ్భీరమ్ = లోతుగల్గిన వానిని, చ = మరియు, వషట్కారమ్ = హవ్యములకు కర్తయైన వానిని....

**తా :** ఓ శివా! నీవు నీ శరణు చొచ్చిన వారికి ఆశ్రయము నిచ్చెదవు. ఆర్తులు అర్థులు అయిన వారి బాధలను తీర్చి రక్షించెదవు. నీవు చాల లోతయిన వాడవు. యజ్ఞపతివి కూడ నీవేయగుట చేత వషట్ పూర్వకముగా హవ్యములను సమర్పింతువు, నీవే స్వీకరింతువు. అట్టి నీకు బిల్వపత్రముతో అర్చన చేయుచున్నాను.

శ్లో॥ భోక్తారం భోజనం భోజ్యం జేతారం జితమానసమ్ ।
కరణం కారణం జిష్ణుమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 71

ప్ర : భోక్తారమ్ = భుజించెడి వానిని, భోజనమ్ = తినుట యనెడి క్రియయైన వానిని, భోజ్యమ్ = తినదగిన పదార్థమైన వానిని, జేతారమ్ = జయించిన వానిని, జితమానసమ్ = జయింపబడిన మనస్సుగల వానిని, కరణమ్ = సాధనమైన వానిని, కారణమ్ = పనిచేయుటకు ప్రేరకుడైన వానిని, జిష్ణుమ్ = జయ శీలము గల వానిని....

**తా :** ఓ శివా! భోజనము నీవే. భోక్తవు నీవే. భోజన క్రియవు నీవే. ఈ మూడును నీవే. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అను మూడును నీవే. నీవు నీ మనస్సును జయించితివి. కావుననే జేతవైతివి. నీ ఆచరణచేత నీ భక్తులకు సైతము నీవు దీనినే బోధించు చున్నావు. చేయించు కారణము నీవే. చేయుట కుపయోగపడు పరికరము కూడ నీవే. అపజయమను మాటయే యెరుగని జయ శీలము గల వాడవు నీవు. అట్టి నిన్ను సన్నుతి సేయుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించుచున్నాను.

**శ్లో॥ క్షేత్రజ్ఞం క్షేత్రపాలం చ పరార్థైకప్రయోజనమ్ ।**
**వ్యోమకేశం భీమవేషమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 72**

**ప్ర :** క్షేత్రజ్ఞమ్ = శరీరమునందుండి ఎఱుకగల వానిని, క్షేత్రపాలమ్ = శరీరమును రక్షించుచు నడిపించుచు నుండు వానిని, పరార్థ + ఏకప్రయోజనమ్ = ఇతరులకు మేలు చేయుట యొక్కటియే ప్రయోజనముగా కలవానిని, వ్యోమకేశమ్ = ఆకాశమే శిరోజరాశిగా కలవానిని, భీమవేషమ్ = భయంకరమైన వేషము గలవానిని....

**తా :** ఓ శివా! నీవు క్షేత్రజ్ఞుడవు. క్షేత్రపాలకుడవు. జీవులలో అంతర్యామిగా ఉండి సర్వమును గ్రహించువాడవు నీవు. అంతేకాదు జీవులను సరియైన కార్యములందు నియోగించి నడిపించువాడవు నీవు. ఇతరులకు మేలు చేయుటయే నీ లక్ష్యము. నీకు ఇతరు లనువారే లేకపోవుటచేత పరమార్థము నందించుటయే పరమలక్ష్యముగా నున్న వాడవు. ఆకాశమే నీ కేశరాశి. అనగా నీవు అంతటి ఔన్నత్యము గలవాడవని సర్వవ్యాపకుడవని అర్థము. భూతపిశాచాదులు నీ అనుచరగణమగుటచేత నీవు కూడా భయంకరవేషధారణము చేయుదువు. ఇట్టి ఔచిత్యపోషణము నీయందు సర్వత్ర కన్పట్టుచున్నది. సాత్త్వికులయిన భక్తులకు నీవు శివుడవు. భూతాదులకు నీవు భయంకర వేషధారివి. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రము సమర్పించి సమర్చించుచున్నాను.

**శ్లో॥ భవఘ్నం తరుణోపేతం క్షోదిష్ఠయమనాశకమ్ ।**
**హిరణ్యగర్భం హేమాఙ్గమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 73**

**ప్ర :** భవఘ్నమ్ = జన్మమును నాశనము చేయువానిని, తరుణోపేతమ్ = యౌవనదశను కలిగియున్న వానిని, క్షోదిష్ఠ = మిక్కిలి క్షుద్రుడైన, యమనాశకమ్ = కాలుని నశింపజేసిన వానిని, హిరణ్యగర్భమ్ = బంగారమును గర్భమందు కలవానిని, హేమ + అంగమ్ = బంగారపు అవయవములు గలవానిని....

**తా :** ఓ శివా! నీవు జన్మ మరణ రూపమైన సంసారమును నశింపజేయు చున్నావు. అట్లు జీవులకు పునర్జన్మము లేకుండ జేసి మోక్షము నిచ్చు చున్నావు. ఎల్లప్పుడును నీవు యౌవనదశను మాత్రమే కలిగియున్నావు. నీవు చెప్పినను వినక మార్కండేయుని ప్రాణములను హరించుటకు వచ్చిన యముడు క్షుద్రుడు కాక యేమగును? పెద్దల మాటను పెడచెవిని పెట్టిన వానిని అట్లే అనవలయును. అందువలననే ఆ క్షుద్రుని నశింపజేసి భక్తుని రక్షించితివి. నీ గర్భమునందు బంగారము కలదు. నీ అవయవములు కూడ స్వర్ణమయములే. అట్టి నిన్ను సన్నుతించుచు పూజాపత్రముగా బిల్వపత్రమును సమర్పించి సమర్చించుచున్నాను.

**శ్లో॥ దక్షం చాముణ్డజనకం మోక్షదం మోక్షనాయకమ్ ।**
**హిరణ్యదం హేమరూపమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 74**

**ప్ర :** దక్షమ్ = సమర్థుడైన వానిని, చాముణ్డజనకమ్ = చాముండుడను రాక్షసుని పుట్టించిన వానిని, మోక్షదమ్ = మోక్షము నిచ్చువానిని, మోక్షనాయకమ్ = మోక్షమునకు నడిపించు వానిని, హిరణ్యదమ్ = బంగారము నొసంగు వానిని, హేమరూపమ్ = బంగారు స్వరూపము గలవానిని....

**తా :** ఓ శివా! నీవు సమర్థుడవు. చాముండుడను పేరుగల రాక్షసుని పుట్టించిన వాడవు. మోక్షము నిచ్చువాడవు నీవు. అంతేకాదు. మోక్షమునకు నడిపించు వాడవు కూడ నీవే. నీవు హిరణ్యగర్భుడవగుటచేత నీవు నీ భక్తులకు హిరణ్యము ననుగ్రహింతువు. నీవు హేమరూపుడవు. అట్టి నిన్ను స్తోత్రము చేయుచు నీకు బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

**శ్లో॥ మహాశ్మశాననిలయం ప్రచ్ఛన్నస్ఫటికప్రభమ్ ।**
**వేదాశ్వం వేదరూపం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 75**

**ప్ర :** మహాశ్మశాననిలయమ్ = మహాశ్మశానమందు నివసించు వానిని, ప్రచ్ఛన్న-స్ఫటికప్రభమ్ = దాగిన స్ఫటికకాంతివంటి కాంతి గలవానిని, వేద + అశ్వమ్ = వేదమును వాహనముగా కలవానిని, వేదరూపమ్ = వేదమే తన రూపమైన వానిని....

**తా :** ఓ శివా! మహాశ్మశానమే నీకు ఆవాసస్థానము. అందువల్లనే శ్మశానమునకు రుద్రభూమి యన్న పేరు ప్రసిద్ధమైనది. స్ఫటికము కానరాకపోయినను తత్కాంతి నీ శరీరమందు ప్రతిఫలించు చున్నట్లు గోచరించు చున్నది. నీకు వేదమే వాహనము. నీవు వేదరూపుడవు. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రము నీకు సమర్పించు చున్నాను.

**శ్లో॥ స్థిరం ధర్మముమానాథం బ్రహ్మణ్యం చాశ్రయం విభుమ్ ।**
**జగన్నివాసం ప్రథమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 76**

**ప్ర :** స్థిరమ్ = నిలుకడ గలవానిని, ధర్మమ్ = సమస్తమును ధరించి యున్న వానిని, ఉమానాథమ్ = పార్వతీపతిని, బ్రహ్మణ్యమ్ = రక్షణచేకూర్చువానిని, చ = మరియు, ఆశ్రయమ్ = ఆధారమైన వానిని, విభుమ్ = ప్రభువయిన వానిని, జగన్నివాసమ్ = జగత్తునకు నివాసమైన వానిని (జగత్తు నందు నివసించు వానిని), ప్రథమమ్ = మొట్ట మొదటి వానిని....

**తా :** ఓ శివా! నీవు నిశ్చలత్వము గలవాడవు. అందువల్లనే స్థిరుడవని స్థాణుడవని ప్రసిద్ధి నొంది యున్నావు. నీ చేతనే యీ సృష్టి యంతయు ధరింపబడుచున్నది. ఈ విధముగా నీవు ధర్మరూపుడవై యున్నావు. నీవు పార్వతీనాథుడవు. రక్షణ కోరుటకు భక్తులకు ఆశ్రయమైన వాడవు నీవు. ఆధారభూతుడవు నీవు. నీవే విభుడవు. జగత్తునే నీ నివాసస్థానముగా ఎన్నుకొనిన వాడవు. సృష్టికి పూర్వము నుండియు నుండుటచేత నీవే మొట్టమొదటి వాడవు. అట్టి నిన్ను బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి సమర్చించుచున్నాను.

**శ్లో॥ రుద్రాక్షమాలాభరణం రుద్రాక్షప్రియవత్సలమ్ ।**
**రుద్రాక్షభక్తసంస్తోమమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 77**

**ప్ర :** రుద్రాక్షమాలాధరమ్ = రుద్రాక్షమాలను ధరించిన వానిని, రుద్రాక్షప్రియ-వత్సలమ్ = రుద్రాక్షలయందు ప్రీతి గలవారి యందు వాత్సల్యము గలవానిని, రుద్రాక్షభక్తసంస్తోమమ్ = రుద్రాక్ష భక్తుల సమూహమును గల వానిని....

**తా :** ఓ శివా! నీవు రుద్రాక్షమాలలను ఆభరణములుగా ధరించినవాడవు. రుద్రాక్షప్రియులయిన భక్తులయెడ నీకు వాత్సల్యము మిక్కుటము. రుద్రాక్షమాలాధారులైన భక్తులు సమూహముగా నిన్ను చుట్టుకొని సేవించు చుందురు. నిన్ను అనుసరించి రుద్రాక్షప్రీతిని కలిగి యుండుట నీ భక్తులయిన వారికి యోగ్యప్రవర్తనమే కదా! అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రముతో నీకు పూజ చేయుచున్నాను.

**శ్లో॥ ఫణీన్ద్రవిలసత్కణ్ఠం భుజఙ్గాభరణప్రియమ్ ।**
**దక్షాధ్వరవినాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 78**

**ప్ర :** ఫణీన్ద్ర–విలసత్–కణ్ఠమ్ = సర్పరాజుచేత ప్రకాశించు నట్టి మెడ కలవానిని, భుజఙ్గాభరణప్రియమ్ = సర్పములను అలంకారములుగా ధరించుట యందు ప్రీతి గల వానిని, దక్ష + అధ్వరవినాశమ్ = దక్షునియొక్క యజ్ఞమును నాశనము చేసిన వానిని....

**తా :** నాగేంద్రుడైన వాసుకిని కంఠము నందు ధరించితివి. అందువలన నీ కంఠము నాగేంద్రహారముచేత ప్రకాశించుచున్నది. నీకు ఇతరాలంకారము లెన్నయిన నుండవచ్చును. కాని సర్పములను ఆభరణములుగా ధరించుటయందే నీకు ప్రీతియెక్కువ. నీకు అవమానము చేయుటయే లక్ష్యముగా పెట్టుకొని దక్షుడు యజ్ఞము మొదలుపెట్టెను. అతడెంత దక్షుడైనను శివదూరమైన యజ్ఞము నెరవేరదు కదా! అందువల్లనే నీవు దక్షయజ్ఞమును నాశనము చేయించితివి. ఓ శివా! అట్టి నిన్ను సన్నుతించుచు పూజాపత్రముగా నీ కొక బిల్వపత్రమును సమర్పించు చున్నాను.

**శ్లో॥ నాగేన్ద్రవిలసత్కర్ణమహీన్ద్రవలయావృతమ్ ।**
**మునివన్ద్యం మునిశ్రేష్ఠమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 79**

**ప్ర :** నాగేన్ద్రవిలసత్‌కర్ణమ్ = సర్పరాజులచేత విలసిల్లుచున్న చెవులు గలవానిని, అహీన్ద్రవలయావృతమ్ = సర్పరాజులను కంకణములుగా ధరించిన వానిని, మునివన్ద్యమ్ = మునులచేత నమస్కరింపబడు వానిని, మునిశ్రేష్ఠమ్ = మునులలో అగ్రగణ్యుడగు వానిని....

**తా :** ఓ శివా! నీవు సర్పరాజులనే కర్ణభూషణములుగా ధరించి యున్నావు. సర్పరాజులనే నీవు కరకంకణములుగా ధరించి యున్నావు. మునులు నీకు నమస్కరించు చున్నారు. నీవు మునులలో అగ్రగణ్యుడవు. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రమును నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ మృగేన్ద్రచర్మవసనం మునీనామేకజీవనమ్ ।**
**సర్వదేవాదిపుణ్యం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 80**

**ప్ర :** మృగేన్ద్రచర్మవసనమ్ = సింహచర్మమును వస్త్రముగా ధరించిన వానిని, మునీనాం + ఏకజీవనమ్ = మునులకు ప్రాణభూతమైన వానిని, సర్వదేవ + ఆది–పుణ్యమ్ = సర్వదేవతలకు మొట్టమొదటి పుణ్యమైన వానిని....

**తా :** ఓ శివా! నీవు సింహచర్మమునే వస్త్రముగా ధరించి యున్నావు. మునీశ్వరులకు ముఖ్యప్రాణము నీవే. సర్వదేవతలకు ప్రధానమైన పుణ్యము నీవే. అట్టి నీకు బిల్వపత్రముతో పూజ చేయుచున్నాను.

**శ్లో॥ నిధనేశం ధనాధీశమపమృత్యువినాశనమ్ ।**
**లిఙ్గమూర్తిమలిఙ్గాత్మమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 81**

**ప్ర :** నిధన + ఈశమ్ = కులమునకు పెద్దయైన వానిని, ధన + అధీశమ్ = ధనమునకు అధిపతియైన వానిని, అపమృత్యువినాశనమ్ = అకాలమరణము తొలగించెడి వానిని, లిఙ్గమూర్తిమ్ = లింగముయొక్క ఆకారము గలవానిని, అలింగ + ఆత్మమ్ = అనాసక్తమయిన ఆత్మగల వానిని....

**తా :** ఓ శివా! నీవే దేవకులమున కంతటికి పెద్దవు. నీవు భిక్షాటకుడుగానే అనిపింతువు గాని నిజమునకు ఐశ్వర్యశాలివి. అకాలమరణమును తొలగించు వాడవు నీవే. నీవు లింగరూపములో భక్తులకు సాక్షాత్కరింతువు. ఇంతయయ్యును నీవు సర్వసృష్టియందును అనాసక్తమైన ఆత్మ గల వాడవు. అట్టి నిన్ను దర్శించుచు పూజాపత్రముగా బిల్వపత్రము నొకదానిని నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ భక్తకల్యాణదం వ్యస్తం వేదవేదాన్తసంస్తుతమ్ ।**
**కల్పకృత్ కల్పపాశం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 82**

**ప్ర :** భక్తకల్యాణదమ్ = భక్తులకు శుభములను దయచేయు వానిని, వ్యస్తమ్ = ఏకాంతుడైన వానిని, వేదవేదాన్తసంస్తుతమ్ = వేదములచేతను, ఉపనిషత్తుల చేతను పొగడబడిన వానిని, కల్పకృత్ = యుగకల్పములను సృజించు వానిని, కల్పపాశమ్ = కల్పములనెడి రజ్జువులు గలవానిని....

**తా :** ఓ శివా! నీవు భక్తులకు శుభములను కలిగింతువు. ఏకాంతముగా నీయంత నీవై యుందువు. వేదముల యందును, ఉపనిషత్తుల యందును నీవు సంస్తుతింప బడుచున్నావు. కల్పములను కల్పించు వాడవు నీవు. కల్పము లనెడి బంధనములతో బంధించువాడవు నీవే. అట్టి నీకు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించు చున్నాను.

**శ్లో॥ ఘోరపాతకదావాగ్నిం జన్మకర్మవివర్జితమ్ ।**
**కపాలమాలాభరణమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 83**

**ప్ర :** ఘోరపాతకదావాగ్నిమ్ = దారుణములైన పాపములకు కార్చిచ్చు వంటి వానిని, జన్మకర్మవివర్జితమ్ = జన్మముకాని కర్మముకాని లేని వానిని, కపాలమాలా–భరణమ్ = పుఱ్ఱెల హారములనే అలంకరించు కొను వానిని....

**తా :** ఓ శివా! ఎంతటి దారుణములైన పాపముల నైనను దహించి వేయగల దావాగ్ని వంటి వాడవు నీవు. జన్మ కర్మములు మానవులకు సహజములు. కాని నీవు జన్మమును గ్రహించినవాడవు కావు. కర్మమును గ్రహించిన వాడవు కావు. అనగా నీవు వాని కతీతుడవు. పుఱ్ఱెలమాలను కంఠహారముగా ధరించిన వాడవు నీవు. అట్టి నిన్ను స్తుతించుచు పూజాపత్రముగా నీకు మారేడుపత్రమును సమర్పించు చున్నాను.

శ్లో॥ మాతఙ్గచర్మవసనం విరాడ్రూపవిదారకమ్ ।
విష్ణుక్రాన్తమనన్తం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **84**

**ప్ర :** మాతఙ్గచర్మవసనమ్ = ఏనుగు చర్మమును వస్త్రముగా ధరించు వానిని, విరాడ్రూపవిదారకమ్ = విశ్వాతిశాయియైన రూపమును ఖండించు వానిని, విష్ణుక్రాన్తమ్ = విష్ణువు నతిక్రమించిన వానిని, అనన్తమ్ = అంతము లేని వానిని....

**తా :** ఓ శివా! ఏనుగు చర్మమును వస్త్రముగా ధరించి యున్నావు. విశ్వరూపమును కూడ అతిక్రమించిన బృహద్రూపమును ధరించి యున్నావు. విశ్వరూపమును ధరించిన విష్ణుదేవుని సైతము నీ మహారూపముచేత అతిక్రమించిన వాడవు. నీవు అనంతుడవు. నీ మొదలుగాని చివరగాని బ్రహ్మవిష్ణువులకే గోచరము కాలేదు. అట్టిది నీ అనంతత్వము. అంతేకాదు ప్రళయకాలమునందు సర్వమును లయము కాగా నీవు మాత్రమే స్థాణుడవై నిలిచి యుందువు. అందువలన కూడ నీవు **అనంత** నామధేయమునకు అర్హుడవే. అట్టి నిన్ను స్తుతించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా సమర్పించి అర్చించుచున్నాను.

**శ్లో॥ యజ్ఞకర్మఫలాధ్యక్షం యజ్ఞవిఘ్నవినాశకమ్ ।**
**యజ్ఞేశం యజ్ఞభోక్తారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 85**

**ప్ర :** యజ్ఞకర్మఫల + అధ్యక్షమ్ = యజ్ఞకార్యముయొక్క ఫలమునకు అధీశుడైన వానిని, యజ్ఞవిఘ్నవినాశకమ్ = యజ్ఞక్రియయందు కలుగు విఘ్నములను నశింప జేయు వానిని, యజ్ఞేశమ్ = యజ్ఞమునకు ప్రభువైన వానిని, యజ్ఞభోక్తారమ్ = యజ్ఞమునందలి హవ్యములను భుజించు వానిని....

**తా :** ఓ శివా! నీవు యజ్ఞపురుషుడవు. యజ్ఞఫలితము ననుభవించు వాడవు నీవు. అట్లే యజ్ఞఫలమును యాజ్ఞికునకు అందించు అధ్యక్షుడవు కూడ నీవే. యజ్ఞమునకు దాపు రించు విఘ్నములను నాశనము చేసి యజ్ఞ సఫల పరిసమాప్తికి సహకరించు వాడవు కూడ నీవే. (యజ్ఞవినాశనము రాక్షసకృత్యము. దక్షయజ్ఞ-నాశకునిగా శివునికి పేరు గలదు. కాని అదియు దక్షునికి గొఱ్ఱెశిరస్సును అతికించి ప్రాణము పోసి శివానుగ్రహమే యజ్ఞమును పూర్తి చేయించెను.) అట్టి నిన్ను బిల్వపత్రముతో అర్చించుచున్నాను.

శ్లో॥ కాలాధీశం త్రికాలజ్ఞం దుష్టనిగ్రహకారకమ్ ।
యోగిమానససంపూజ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **86**

**ప్ర :** కాల + అధీశమ్ = కాలమునకు అధీశ్వరుడైన వానిని, త్రికాలజ్ఞమ్ = మూడు కాలములను గురించి తెలిసిన వానిని, దుష్టనిగ్రహకారకమ్ = దుష్టులను బంధింప జేయువానిని, యోగిమానససంపూజ్యమ్ = యోగులచేత మనస్సులలో పూజలందుకొను వానిని....

**తా :** ఓ శివా! నీవు కాలమునకు అధీశుడవు. కాలము నీ అధీనమునందున్నది. నీవు భూతభవిష్యద్వర్తమానములనెడి మూడు కాలములను తెలిసిన వాడవు. దుష్టులను బంధించుటకు కారణమైన వాడవు నీవు. యోగులు తమ మనస్సులలో నిన్నే పూజించుచున్నారు. యోగుల మానసపూజను అందుకొను వాడవు నీవే. అట్టి నిన్ను సాక్షాత్కరించుకొని బిల్వపత్రముతో పూజించుచున్నాను.

**శ్లో॥ మహోన్నతమహాకాయం మహోదయమహాభుజమ్ ।**
**మహావక్త్రం మహావృద్ధమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 87**

**ప్ర :** మహోన్నతమహాకాయమ్ = గొప్ప యెత్తుగల గొప్ప శరీరము గలవానిని, మహోదయమహాభుజమ్ = గొప్ప అభివృద్ధి నొందిన గొప్ప బాహువులను గల వానిని, మహావక్త్రమ్ = అనేక ముఖములను గల వానిని, మహావృద్ధమ్ = గొప్పగా శరీరమును పెంచి వృద్ధి నొందిన వానిని....

**తా :** ఓ శివా! నీవు అప్రమేయుడవు. కొలతకు అందని వాడవు. వ్యోమకేశుడ వనుటచేతనే నీ ఔన్నత్యమును కొంత యూహింప వచ్చును. అట్లే అనేక భుజములు గలవాడవు. అనేక ముఖములు గలవాడవు. నీ వృద్ధి యింతయని చెప్పుటకు వీలుకానిది. అట్టి నిన్ను సన్నుతించుచు బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

**శ్లో॥ సునేత్రం సులలాటం చ సర్వభీమపరాక్రమమ్ ।**
**మహేశ్వరం శివతరమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 88**

**ప్ర :** సునేత్రమ్ = మంచి కన్నులు గలవానిని, సులలాటమ్ = మంచి నొసలు గల వానిని, చ = మరియు, సర్వభీమపరాక్రమమ్ = అందరకును భయము గొల్పు శౌర్యము గలవానిని, మహేశ్వరమ్ = మహేశ్వర నామధేయుని, శివతరమ్ = మంగళకరులలో ఉత్తముని....

**తా :** ఓ శివా! నీవు సుందరములైన నేత్రములు గలవాడవు. సుందరమైన ఫాలభాగము కలవాడవు. అందరకును భయము కల్గించు గొప్ప విక్రమము గలవాడవు. నీ శక్తిశాలిత్వముచేత మహేశ్వరుడన్న ప్రఖ్యాతిని బడసిన వాడవు. ఉత్తమోత్తమ మంగళుడవు. అట్టి నిన్ను సంభావించి బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

**శ్లో॥ సమస్తజగదాధారం సమస్తగుణసాగరమ్ ।**
**సత్యం సత్యగుణోపేతమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 89**

**ప్ర :** సమస్త–జగత్ + ఆధారమ్ = సర్వలోకములకు ఆధారమైన వానిని, సమస్త–గుణసాగరమ్ = సర్వసుగుణములకు సముద్రమువంటి వానిని, సత్యమ్ = శాశ్వతమైన ఉనికి గల వానిని, సత్యగుణ + ఉపేతమ్ = సత్యగుణసమన్వితుడైన వానిని....

**తా :** ఓ శివా! నీవు సర్వలోకములకు ఆధారమైన వాడవు. నీవు సర్వసుగుణములకు సముద్రమువంటి వాడవు. సముద్రమునకు అంతము లేనట్లే నీ సుగుణములకు కూడ అంతము లేదు. నీవు శాశ్వతుడవు. సత్యగుణముతో కలిసియున్న వాడవు. అట్టి నిన్ను సంభావించుచు బిల్వపత్రార్చనము గావించుచున్నాను.

**శ్లో॥ మాఘకృష్ణచతుర్దశ్యాం పూజార్థం చ జగద్గురోః ।**
**దుర్లభం సర్వదేవానామ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 90**

**ప్ర :** మాఘ = మాఘమాసమునందలి, కృష్ణచతుర్దశ్యామ్ = కృష్ణపక్షచతుర్దశి నాడు, జగద్గురోః = జగద్గురువైన శివునియొక్క, పూజార్థమ్ = పూజకొరకు, సర్వదేవానామ్ = సర్వదేవతలకును, దుర్లభమ్ = కష్టసాధ్యమైన, ఏకబిల్వమ్ = బిల్వపత్రమును, శివ + అర్పణమ్ = శివునికి అర్పించుచున్నాను.

**తా :** మాఘ కృష్ణ చతుర్దశి నాడు సర్వదేవతలకును దుర్లభమైన బిల్వపత్రమును జగద్గురువైన శివుని పూజార్థముగా '**శివార్పణ**' మని చెప్పి సమర్పించుచున్నాను.

**శ్లో॥ తత్రాపి దుర్లభం మన్యే నభోమాసేన్దువాసరే ।**
**ప్రదోషకాలే పూజాం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 91**

**ప్ర :** తత్ర + అపి = అందును, నభోమాస = శ్రావణమాసమునందు, ఇందు– వాసరే = సోమవారము నాడు, ప్రదోషకాలే = గోధూళి సమయమందు, పూజామ్ = పూజించుటయు, ఏకబిల్వమ్ = బిల్వదళమును, శివార్పణమ్ = శివార్పణమని అర్పించుటయు, దుర్లభమ్ = బహుకష్టమని, మన్యే = భావించుచున్నాను.

**తా :** పైని చెప్పినట్లు మాఘమాసములోని పూజకంటే శ్రావణమాసమునందలి పూజ కష్టతరమని తలచుచున్నాను. శ్రావణమాసములో సోమవారము నాడు గోధూళి సమయమందు పూజ చేయుచు "**శివార్పణ**" మని చెప్పుచు బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

**శ్లో॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం శివాలయమ్ ।**
**కోటికన్యామహాదానమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 92**

**తా :** చెఱువు త్రవ్వించుట, ధనమును నిక్షేపించుట, బ్రాహ్మణాగ్రహారమును నిల్పుట, శివాలయమును నిర్మించుట, కోటికన్యలను మహాదానము చేయుట – వీని కంటె '**శివార్పణ**' మని బిల్వపూజచేయుట శ్రేష్ఠము.

**శ్లో॥ దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనమ్ ।**
**అఘోరపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 93**

**తా :** బిల్వవృక్షముయొక్క దర్శనస్పర్శనములు పాపములను నశింపజేయును. ఎంతటి దారుణపాపములైనను '**శివార్పణ**' మని బిల్వపూజ చేసిన యెడల నశించి పోవును.

**శ్లో॥ తులసీ-బిల్వ-నిర్గుణ్డీ-జమ్బీరామలకం తథా ।**
**పఞ్చబిల్వమితి ఖ్యాతమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 94**

**తా : తులసి, మారేడు, వావిలి, నిమ్మ, ఉసిరిక** యీ యైదింటికి పంచ బిల్వములని పేరు. శివార్పణ మని ఒక బిల్వపత్రమును సమర్పింప వలయును.

శ్లో॥ అఖణ్డబిల్వపత్రైశ్చ పూజయేన్నన్దికేశ్వరమ్ ।
ముచ్యతే సర్వపాపేభ్యో హ్యేకబిల్వం శివార్పణమ్ ॥ **95**

**తా :** రన్ధ్రములు లేని బిల్వపత్రములతో నందికేశ్వరుని కూడా పూజింప వలయును. శివార్పణమని శివునికి బిల్వమును సమర్పింపవలయును. అప్పుడు సర్వపాపముల నుండి విడుదల కలుగును.

**శ్లో॥ సాలఙ్కృతా-శతవృత్తా-కన్యాకోటి-సహస్రకమ్ ।**
**సామ్రాజ్యపృథ్వీదానం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 96**

**తా :** అలంకరింపబడిన సహస్రకోటికన్యలను సామ్రాజ్యమునందలి సర్వభూమిని దానం చేసిన ఫలితము '**శివార్పణ**' మని బిల్వపత్రమును సమర్పించుటచేత లభించును.

**శ్లో॥ దన్త్యశ్వకోటిదానాని హ్యశ్వమేథ-సహస్రకమ్ ।**
**సవత్సధేనుదానాని ఏకబిల్వం శివార్పణమ్ ॥ 97**

**తా :** కోట్లకొలది యేనుగులను గుఱ్ఱములను దానము చేయుటచేతను, వేలకొలది అశ్వమేథములను చేయుటచేతను, దూడలతో పాటుగా పాడియావులను దానము చేయుటచేతను కలిగిన ఫలితము కంటె 'శివార్పణ' మని బిల్వపూజ చేసిన అధిక ఫలితము లభించును.

**శ్లో॥ చతుర్వేదసహస్రాణి భారతాదిపురాణకమ్ ।**
**సామ్రాజ్యపృథ్వీదానం చ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 98**

**తా :** శివార్పణ మని ఒక బిల్వమును సమర్పించినచో చతుర్వేదములను వేలాదిగా దానము చేసిన పుణ్యము లభించును. అట్లే భారతపురాణాది గ్రంథములను, సామ్రాజ్యభూమిని దానము చేసిన పుణ్యము లభించును.

**శ్లో॥ సర్వరత్నమయం మేరుం కాఞ్చనం దివ్యవస్త్రకమ్ ।**
**తులాభారం శతావర్తమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 99**

**తా :** శివార్పణమని బిల్వపూజ చేసిన ఫలితము సర్వరత్నములతోను బంగారము తోను కూడిన మేరుపర్వతమును, దివ్యవస్త్రములను, తులాభారము తూగి నూరు రెట్లుగా దానము చేసిన ఫలితము తోను తుల్యము.

**శ్లో॥ అష్టోత్తరశతం బిల్వం యోఽర్చయేల్లిఙ్గమస్తకే ।**
**అథర్వోక్తం వదేద్యస్తు ఏకబిల్వం శివార్పణమ్ ॥ 100**

**తా :** 'ఏకబిల్వం శివార్పణ' మని లింగశీర్షముపై నూటయెనిమిది బిల్వపత్రముల నుంచి అష్టోత్తరశతమును అథర్వణోక్తము ననుసరించి పఠింప వలయును. అర్పింప వలయును.

**శ్లో॥ కాశీక్షేత్రనివాసం చ కాలభైరవదర్శనమ్ ।**
**అఘోరపాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 101**

**తా :** కాశీక్షేత్రమునందు నివసించుట, కాలభైరవుని దర్శించుట, యే విధముగా దారుణ పాపములను తొలగించునో, ఆ విధముగనే శివార్పణమని బిల్వపూజ చేయుట ఘోరపాపములను తొలగించును.

శ్లో॥ అష్టోత్తరశతశ్లోకైః స్తోత్రాద్యైః పూజయేద్యథా ।
త్రిసన్ధ్యం మోక్షమాప్నోతి ఏకబిల్వం శివార్పణమ్ ॥ **102**

**తా :** శివార్పణమని బిల్వపత్రమును అర్పింపగా నూటయెనిమిది శ్లోకములతో, స్తోత్రాదులతో మూడు సంధ్యలందును పూజించినట్లుగా భక్తుడు మోక్షమును పొందును.

**శ్లో॥ దన్తికోటిసహస్రాణాం భూహిరణ్యసహస్రకమ్ ।**
**సర్వక్రతుమయం పుణ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 103**

**తా :** వేల కోట్ల యేనుగులను భూమిని బంగారమును వేలాదిగా దానము చేయుట వలన, సర్వయజ్ఞనిర్వహణవలన లభించెడి ఫలము '**శివార్పణ**' మని బిల్వార్చన చేయుట వలన కలుగును.

**శ్లో॥ పుత్రపౌత్రాదికం భోగం భుక్త్వా చాత్ర యథేప్సితమ్ ।**
**అన్తే చ శివసాయుజ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 104**

**తా :** శివార్పణ మని బిల్వదళమును సమర్పించిన భక్తుడు ఈ లోకమునందు పుత్రులతో మనుమలతో కోరిన భోగముల ననుభవించి, మరణించిన పిమ్మట శివసాయుజ్యమును పొందును.

**శ్లో॥ విప్రకోటిసహస్రాణాం విత్తదానాచ్చ యత్ఫలమ్ ।**
**తత్ఫలం ప్రాప్నుయాత్ సత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 105**

**తా :** కోట్లకొలది జ్ఞానులకు ధనదానము చేయుటచేత ఏ ఫలము లభించునో నిశ్చయముగా ఆ ఫలమును '**శివార్పణ**' మని బిల్వార్చన చేసినవాడును పొందగలడు.

**శ్లో॥ త్వన్నామకీర్తనం తద్వత్ తవ పాదామ్బు యః పిబేత్ ।**
**జీవన్ముక్తో భవేన్నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 106**

**తా :** ఒక బిల్వపత్రమును శివార్పణమని నీకు సమర్పించిన వాడును, నీ నామకీర్తన రసమును అట్లే నీ పాదజలమును త్రాగిన వాడును నిత్యము జీవన్ముక్తుడై యుండును.

**శ్లో॥ అనేకదానఫలదమనన్తసుకృతాదికమ్ ।**
**తీర్థయాత్రాఖిలం పుణ్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 107**

**తా :** శివార్పణముగా బిల్వార్చనము చేసిన వానికి అనేక దానముల యొక్క ఫలమును, అనంతములైన సత్కార్యములయొక్క ఫలమును, అఖిలతీర్థయాత్రల యొక్క పుణ్యఫలమును లభించును.

**శ్లో॥ త్వం మాం పాలయ సర్వత్ర పదధ్యానకృతం తవ ।**
**భవనం శాఙ్కరం నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 108**

**తా :** బిల్వదళమును శివార్పణమని నీకు సమర్పించుచున్నాను. అన్నియెడల నీ పాదములనే ధ్యానించెడి నన్ను పాలింపుము. ఎల్లప్పుడును నన్ను నీవానినిగా నుండనిమ్ము.

# అధికపాఠములు

**శ్లో॥ ఉమయాసహితం దేవం సవాహనగణం శివమ్ ।**
**భస్మానులిప్తసర్వాఙ్గమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 109**

**తా :** ఓ శివా! పార్వతీదేవితో కలిసి యున్న వానిని, వాహన గణ సమేతుడయిన వానిని, విభూతితో పూత పూయబడిన శరీరావయవములను కలవానిని నిన్ను స్తుతించుచు బిల్వపత్రమును పూజాపత్రముగా నీకు సమర్పించుచున్నాను.

**శ్లో॥ సాలగ్రామసహస్రాణి విప్రాన్నం శతకోటికమ్ ।**
**యజ్ఞకోటిసహస్రాణి ఏకబిల్వం శివార్పణమ్ ॥ 110**

**తా :** వెయ్యి సాలగ్రామములను దానము చేయుట, శత కోటి విప్రులకు అన్నదానము చేయుట, కోట్ల కొలది యజ్ఞములను చేయుట వీనివలన కలిగెడి ఫలితముతో సమాన మైనది '**శివార్పణ**' మని శివునికి బిల్వార్చనము నిర్వహించుట.

**శ్లో॥ అజ్ఞానేన కృతం పాపం జ్ఞానేనాపి కృతం చ యత్ ।**
**తత్సర్వం నాశమాయాతు ఏకబిల్వం శివార్పణమ్ ॥ 111**

**తా :** తెలిసికాని, తెలియక కాని చేసిన పాపమంతయును నాశమగు గాక! శివా! నీకు బిల్వపత్రమును సమర్పించుచున్నాను.

నాశమ్+ఆయాతు ---> ఆఙ్+యాతు ---> లోట్ ప్ర.ఏ.

**శ్లో॥ ఏకైకబిల్వపత్రేణ కోటియజ్ఞఫలం భవేత్ ।**
**మహాదేవస్య పూజార్థమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ 112**

**తా :** మహాదేవుడైన శివుని పూజ కొఱకు బిల్వపత్రమును శివార్పణమని సమర్పించు చున్నాను. ఒక్కొక్క బిల్వపత్రముచేత కోటియజ్ఞముల ఫలము లభించునుగాక!

**శ్లో॥ అమృతోద్భవవృక్షస్య మహాదేవప్రియస్య చ ।**
**ముచ్యతే కణ్టకాఘాతాత్ కణ్టకేభ్యో హి మానవాః ॥ 113**

**తా :** అమృతోద్భవమైనదియు మహాదేవుడైన శివునికి ప్రీతిపాత్రమైనదనియు నైన బిల్వవృక్షముయొక్క పత్రముతో పూజను నిర్వహించుట చేత కంటకాఘాతముల నుండి, ముండ్లనుండి, ముష్కరులనుండి నిశ్చయముగా మానవులు ముక్తిని పొందుదురు.

# ఫలశ్రుతి

శ్లో॥ ఏకకాలే పఠేన్నిత్యం సర్వశత్రునివారణమ్ ।
దివ్కాలే చ పఠేన్నిత్యమ్ ఏకబిల్వం శివార్పణమ్ ॥ **114**

**తా :** శివార్పణముగా బిల్వదళమును సమర్పించి, యీ స్తవము నొక్క మారు గాని రెండు మారులు గాని ప్రతిదినము చదివినచో విరోధులెల్లరును నిరోధింప బడుదురు.

**శ్లో॥ త్రికాలే చ పఠేన్నిత్యం మనోవాఞ్ఛాఫలప్రదమ్ ।**
**అచిరాత్ కార్యసిద్ధిం చ లభతే నాత్ర సంశయః ॥ 115**

**తా :** ప్రతిదినము మూడు కాలములందును పఠించిన యెడల మనోవాంఛ ఫలించును. తొందరలోనే కార్యసిద్ధి కలుగును. ఇందు సందియము లేదు.

**శ్లో॥ ఏకకాలం ద్వికాలం వా త్రికాలం యః పఠేన్నరః ।**
**లక్ష్మీప్రాప్తిః శివావాసః శివేన సహ మోదతే ॥ 116**

**తా :** ఏ నరుడు ఒకమారుగాని రెండు మారులు గాని మూడు మారులు గాని ప్రతిదినము పఠించునో అతనికి సంపదలు లభించును. శివలోకము లభించును. శివుని సహవాసముతో అతడు ఆనందము నొందును.

శ్లో॥ కోటిజన్మకృతం పాపమర్చనేన వినశ్యతి ।
సప్తజన్మకృతం పాపం శ్రవణేన వినశ్యతి ॥ **117**

**తా :** కోటి జన్మములలో చేసిన పాపము బిల్వార్చనముచేత నశించును. ఏడు జన్మములలో చేసిన పాపము ఈ స్తోత్రమును శ్రవణము చేయుటచేత నశించును.

**శ్లో॥ జన్మాన్తరకృతం పాపం పఠనేన వినశ్యతి ।**
**దివారాత్రకృతం పాపం దర్శనేన వినశ్యతి ॥ 118**

**తా :** ఇతర జన్మములయందు చేసిన పాపము స్తోత్రపఠనము చేత నశించును. అహోరాత్రములందు (ఒక్కనాడు) చేసిన పాపము దర్శనముచేత నశించును.

శ్లో॥ క్షణే క్షణే కృతం పాపం స్మరణేన వినశ్యతి ।
పుస్తకం ధారయేద్దేహీ హ్యారోగ్యం భయనాశనమ్ ॥ 119

**తా :** ప్రతిక్షణమును చేయు పాపము స్మరణమాత్రముచేత నశించును. పుస్తకమును ధారణ చేసినవాడు భయము నశించి ఆరోగ్యవంతుడై జీవించును.

**శ్లో॥ యే మామనన్యశరణాస్సతతం వరేణ్యం**
**సంపూజయన్తి నవకోమలబిల్వపత్రైః ।**
**తే నిర్గుణా అపి గుణామ్బుధయో భవన్తి**
**విన్దంతి భక్తిమనుభుక్తసమస్తభోగాః ॥ 120**

**తా :** ఎవరు వరేణ్యుడ నైన నన్ను అనన్యశరణులై కొత్తవియు కోమలములునైన బిల్వదళములతో ఎల్లప్పుడును అర్చించుచున్నారో వారు గుణహీనులే యైనప్పటికిని గుణసముద్రు లగుచున్నారు. వారు సమస్తభోగములను అనుభవించిన వారై భక్తిలాభమును పొందుచున్నారు.

**శ్లో॥ బిల్వాష్టోత్తరశతం స్తోత్రం యః పఠేద్ భక్తిమాన్నరః ।**
**శివలోకమవాప్నోతి శివేన సహ మోదతే ॥ 121**

**తా :** బిల్వాష్టోత్తర శతమనెడి యీ స్తోత్రమును భక్తియుక్తుడై యే మానవుడు పఠించునో, ఆ మానవుడు శివలోకమును పొంది శివునితో ఆనందించును.

**శుభమస్తు**

**లోకాః సమస్తాః సుఖినో భవన్తు**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ఓం**

**శ్రీః**

# శ్రీః

# శ్రీశివపఞ్చాక్షరీస్తోత్రమ్

### (శ్రీశఙ్కరాచార్యకృతమ్)

నాగేన్ద్రహారాయ త్రిలోచనాయ
భస్మాఙ్గరాగాయ మహేశ్వరాయ ।
నిత్యాయ శుద్ధాయ దిగమ్బరాయ
తస్మై '**న**' కారాయ నమశ్శివాయ ॥ 1



మన్దాకినీసలిలచన్దనచర్చితాయ
నన్దీశ్వరప్రమథనాథమహేశ్వరాయ ।
మన్దారముఖ్యబహుపుష్పసుపూజితాయ
తస్మై '**మ**'కారమహితాయ నమశ్శివాయ ॥ 2



శివాయ గౌరీవదనారవిన్ద-
సూర్యాయ దక్షాధ్వరనాశనాయ ।
శ్రీనీలకణ్ఠాయ వృషధ్వజాయ
తస్మై '**శి**'కారాయ నమశ్శివాయ ॥ 3



వశిష్ఠకుమ్భోద్భవగౌతమాది
మునీన్ద్రదేవార్చితశేఖరాయ ।
చన్ద్రార్కవైశ్వానరలోచనాయ
తస్మై '**వ**'కారాయ నమశ్శివాయ ॥ 4



యక్షస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ ।
సుదివ్యదేహాయ దిగమ్బరాయ
తస్మై '**య**'కారాయ నమశ్శివాయ ॥ 5



పఞ్చాక్షరమిదం పుణ్యం యః పఠేచ్ఛివసన్నిధౌ ।
శివలోకమవాప్నోతి శివేన సహమోదతే ॥



**శ్రీః**

# పఞ్చముఖశివధ్యానమ్

**ఓం *నం॥* తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నో రుద్రః ప్రచోదయాత్॥**

**శ్లో॥ సంవర్తాగ్నితటిత్ప్రదీప్తకనకప్రస్పర్ధితేజోమయం**
**గమ్భీరధ్వనిమిశ్రితోగ్రదహనప్రోద్భాసితామ్రాధరమ్ ।**
**అర్ధేన్దుద్యుతిలోలపిఙ్గళజటాభారప్రబద్ధోరగం**
**వన్దే సిద్ధసురాసురేన్ద్రనమితం పూర్వం ముఖం శూలినః ॥ 1**

ప్ర : **సంవర్త–అగ్ని–తటిత్–ప్రదీప్త–కనక–ప్రస్పర్ధి–తేజో–మయమ్** = ప్రళయకాలమందలి అగ్నితోను – మెఱపులతోను – బాగుగా ప్రకాశించుచుండు బంగారముతోను – మిక్కిలిగా పోటీపడుచుండు తేజములతో నిండినదియును; **గంభీర–ధ్వని–మిశ్రిత–ఉగ్ర–దహన–ప్ర–ఉద్భాసి–తామ్ర–అధరమ్** = గంభీరమగు ధ్వనితో కలిసినది అగుచు భయంకరమగు అగ్నివలె మిగుల ప్రకాశించుచుండు ఎఱ్ఱని క్రింది పెదవి కలదియును; **అర్ధ–ఇందు–ద్యుతి–లోల–పింగళ–జటా–భార–ప్ర–బద్ధ–ఉరగమ్** = అర్ధచంద్రుని కాంతితో (కూడినదగుచు) చంచలమును ఎఱ్ఱదనముకల పసిమి ఛాయకల జడలభారమునందు మిక్కిలిగా బంధించబడిన సర్పములు కలదియు; **సిద్ధ–సుర–అసుర–ఇంద్ర–నమితమ్** = సిద్ధశ్రేష్ఠులచే దేవశ్రేష్ఠులచే – అసురశ్రేష్ఠులచే – నమస్కరించబడునదియు; అగు; **శూలినః** = శూలధారికి (శివునకు) సంబంధించిన; **పూర్వమ్** = తూర్పుదిక్కునందు ఉండు; **ముఖమ్** = ముఖమును, వందే = నమస్కరించుచున్నాను.

**ఓం నమోభగవతే రుద్రాయ। ఓం *నం* పూర్వముఖాయ నమః ॥**



**ఓం *మం॥* అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః ॥ సర్వతశ్శర్వ! సర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః ॥**

**శ్లో॥ కాలాభ్రభ్రమరాఞ్జనద్యుతినిభం వ్యావృత్తపిఙ్గేక్షణం**
**కర్ణోద్భాసితభోగిమస్తకమణిప్రోద్భిన్నదంష్ట్రాఙ్కురమ్ ।**
**సర్పప్రోతకపాలశుక్తిశకలవ్యాకీర్ణసఞ్చారగం**
**వన్దే దక్షిణమీశ్వరస్య కుటిలభ్రూభఙ్గరౌద్రం ముఖమ్ ॥ 2**

ప్ర : **కాల-అభ్ర-భ్రమర-అంజన-ద్యుతి-నిభమ్** = నల్లని మేఘములయు తుమ్మెదలయు - కాటుకలయు కాంతివంటికాంతితో మిక్కిలిగా ప్రకాశించునదియు, **వి-ఆవృత్త-పింగ-ఈక్షణమ్** = మిక్కిలిగా తిరుగుచుండు పసిమితో కూడిన ఎఱ్ఱదనముగల కన్నులు కలదియు; **కర్ణ-ఉద్భాసిత-భోగి-మస్తక-మణి-ప్ర-ఉద్భిన్న-దంష్ట్రా-అంకురమ్** = చెవులయందు బాగుగ ప్రకాశించుచుండు సర్పముల శిరములందలి మణులతో మిక్కిలిగా మిశ్రితమయి కనబడుచుండు కోరల మొలకలు కలదియు; **సర్ప-ప్రోత-కపాల-శుక్తి-శకల-వ్యాకీర్ణ-సంచారగమ్** = సర్పములతో (పాటు హారముగా) కూర్చబడిన కపాలములయు ముత్తెపుచిప్పలయు ముక్కలతో కలుగు కదలికలతో వ్యాప్తమును; **కుటిల-భ్రూ-భంగ-రౌద్రమ్** = వంకరలగు కనుబొమలముడులతో భయంకరమును, అగు; **ఈశ్వరస్య** = శివుని, **దక్షిణమ్** = దక్షిణమునందలి, **ముఖమ్** = ముఖమును, **వందే** = నమస్కరించుచున్నాను.

**ఓం నమో భగవతే రుద్రాయ ॥ ఓం *మం* ॥ దక్షిణముఖాయ నమః**



**ఓం *శిం*। సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమో నమః । భవే భవే నాతిభవే భవస్వ మాం । భవోద్భవాయ నమః ॥**

**శ్లో॥ ప్రాలేయాచలచన్ద్రకున్దధవళం గోక్షీరఫేనప్రభం**
**భస్మాభ్యక్తమనఙ్గదేహదహనజ్వాలావళీలోచనమ్ ।**
**బ్రహ్మేన్ద్రాదిమరుద్గణైస్స్తుతిపరైరభ్యర్చితం యోగిభి-**
**ర్వన్దేఽహం సకలం కళఙ్కరహితం స్థాణోర్ముఖం పశ్చిమమ్ ॥ 3**

ప్ర : **ప్రాలేయ-అచల-చంద్ర-కున్ద-ధవళమ్** = మంచుకొండ - చంద్రుడు - మొల్లపూవు - వీనివలె తెల్లనిదియు; **గోక్షీర-ఫేన-ప్రభమ్** = ఆవుపాలమీది నురుగునకు కల కాంతివంటి కాంతి కలదియు; **భస్మ-అభ్యక్తమ్** = భస్మముతో అంతటను పూయబడినదియు; **అనంగ-దేహ-దహన-జ్వాలా-ఆవళీ-లోచనమ్** = మన్మథుని దేహమును దహించు జ్వాలల పంక్తులు కల కన్ను కలదియు; **స్తుతి - పరైః** = స్తోత్రము చేయుటయందు ఆసక్తులగు; **బ్రహ్మ-ఇంద్ర-ఆది-మరుద్-గణైః** = బ్రహ్మ ఇంద్రుడు మొదలగు దేవతల సమూహములచే, **యోగిభిః** = యోగులచే, **అభ్యర్చితమ్** = బహువిధముల అర్చించబడునదియు; **స-కలమ్** = (చంద్ర) కళతో కూడినదియు; **కళంక-రహితమ్** = కళంకము ఏమియు లేనిదియు (నిర్మలమును); అగు; **స్థాణోః** = స్థాణు(శివు)ని; **పశ్చిమమ్** = పడమటిది అగు; **ముఖమ్** = ముఖమును, **వందే** = నమస్కరించుచున్నాను.

**ఓం నమో భగవతే రుద్రాయ । ఓం *శిం* ॥ పశ్చిమముఖాయ నమః ॥**



**ఓం *వాం* ॥ వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలప్రమథనాయ నమస్సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః ॥**

**శ్లో॥ గౌరం కుఙ్కుమపఙ్కిలం సుతిలకం వ్యాపాణ్డుగణ్డస్థలం**
**భ్రూవిక్షేపకటాక్షవీక్షణలసత్సంసక్తకర్ణోత్పలమ్ ।**
**స్నిగ్ధం బిమ్బఫలాధరప్రహసితం నీలాలకాలఙ్కృతం**
**వన్దే పూర్ణశశాఙ్కమణ్డలనిభం వక్త్రం హరస్యోత్తరమ్ ॥ 4**

ప్ర : **గౌరమ్** = గౌరవర్ణము కలదియు; **కుంకుమ-పంకిలమ్** = కుంకుమపూబూతతో బురదకలదియు; **సు-తిలకమ్** = చక్కని తిలకము కలదియు; **వి-ఆ-పాండు-గండ-స్థలమ్** = మిక్కిలిగా అంతటను తెల్లనగు చెక్కిలి ప్రదేశము కలదియు; **భ్రూ-విక్షేప-కటాక్ష-వీక్షణ-లసత్** = కనుబొమల కదలికలచే - కడగంటిచూపులచే ప్రకాశించునదియు; **సంసక్త-కర్ణ-ఉత్పలమ్** = చక్కగా అమరియున్న తన చెవియందలి కలువపూవు కలదియు; **స్నిగ్ధమ్** = నున్ననిదియు; **బింబ-ఫల-అధర-ప్రహసితమ్** = దొండపండువలెనున్న పెదవియందలి గొప్పనవ్వు కలదియు; **నీల-అలక-అలంకృతమ్** = నల్లని ముంగురులచే అలంకరింపబడినదియు; **పూర్ణ-శశాంక-మండల-నిభమ్** = నిండుచందురుని మండలమువలె ప్రకాశించునదియు; అగు; **హరస్య** = శివుని, **ఉత్తరమ్** = ఉత్తరపుది అగు; **వక్త్రమ్** = ముఖమును, **వందే** = నమస్కరించుచున్నాను.

**ఓం నమో భగవతే రుద్రాయ ॥ ఓం *వాం* ॥ ఉత్తరముఖాయ నమః ॥**



**ఓం *యం* ॥ ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతి-ర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్ ॥**

**శ్లో॥ వ్యక్తావ్యక్తగుణేతరం సువిమలం షట్త్రింశతత్త్వాత్మకం**
**తస్మాదుత్తమతత్త్వమక్షరమిదం ధ్యేయం సదా యోగిభిః ।**
**వన్దే తామసవర్జితం త్రిణయనం సూక్ష్మాతిసూక్ష్మాత్పరం**
**శాన్తం పఞ్చమీశ్వరస్య వదనం ఖ-వ్యాప్తితేజోమయమ్ ॥ 5**

ప్ర : **వ్యక్త-అవ్యక్త-గుణ-ఇతరమ్** = వ్యక్తములును - అవ్యక్తములును అగు రెండు విధములగు గుణములు కల రూపముకంటె ఇతరమును; **సు-విమలమ్** = మిగుల నిర్మలమును; **షట్త్రింశ-తత్త్వ-ఆత్మకమ్** = ముప్పదియారు తత్త్వములును తన ఆత్మ (శరీరము)గా కలదియు; **తస్మాత్** = దానికంటెను; అట్టి రూపముకంటెను; **ఉత్తర-తత్త్వమ్** = ఆవలి తత్త్వము; **అక్షరమ్** = అక్షర (నాశరహిత) తత్త్వము, **ఇతి** = అని; **యోగిభిః** = యోగులచేత; **సదా** = ఎల్లప్పుడును; **ధ్యేయమ్** = ధ్యానించబడు (బడదగిన)దియు; **తామస-వర్జితమ్** = తామస లక్షణములచే వదలబడినదియు; **త్రి-నయనమ్** = మూడు కన్నులు కలదియు; **సూక్ష్మ-అతిసూక్ష్మాత్** = సూక్ష్మమగు దానికంటెను మిగుల సూక్ష్మమగు దానికంటెను కూడ; **పరమ్** = ఉత్కృష్టమును; ఆవలిదియు; **ఖ-వ్యాపి-తేజో-మయమ్** = ఆకాశమునందు (అంతటను) వ్యాపించు తేజములతో నిండినదియు; **శాంతమ్** = శాంతరూపమును; అగు; **ఈశ్వరస్య** = ఈశ్వరుని; **పంచమమ్** = ఐదవ; **వదనమ్** = ముఖమును, **వందే** = నమస్కరించుచున్నాను.

**ఓం నమో భగవతే రుద్రాయ ॥ ఓం *యం* ॥ ఊర్ధ్వముఖాయ నమః ॥**



# పాణిమన్త్రము

ఓం నిధనపతయే నమః
ఓం నిధనపతాన్తికాయ నమః
ఓం ఊర్ధ్వాయ నమః
ఓం ఊర్ధ్వలిఙ్గాయ నమః
ఓం హిరణ్యాయ నమః
ఓం హిరణ్యలిఙ్గాయ నమః
ఓం సువర్ణాయ నమః
ఓం సువర్ణలిఙ్గాయ నమః
ఓం దివ్యాయ నమః
ఓం దివ్యలిఙ్గాయ నమః
ఓం భవాయ నమః
ఓం భవలిఙ్గాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం శర్వలిఙ్గాయ నమః
ఓం శివాయ నమః
ఓం శివలిఙ్గాయ నమః
ఓం జ్వలాయ నమః
ఓం జ్వలలిఙ్గాయ నమః
ఓం ఆత్మాయ నమః
ఓం ఆత్మలిఙ్గాయ నమః
ఓం పరమాయ నమః
ఓం పరమలిఙ్గాయ నమః

ఓం ఏతత్సోమస్య సూర్యస్య సర్వలిఙ్గగ్ స్థాపయతి
పాణిమన్త్రం పవిత్రమ్ ॥



## శ్రీః

# అర్ధనారీశ్వరస్తోత్రమ్

చామ్పేయగౌరార్ధశరీరకాయై కర్పూరగౌరార్ధశరీరకాయ ।
ధమ్మిల్లకాయై చ జటాధరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 1

కస్తూరికాకుఙ్కుమచర్చితాయై చితారజఃపుఞ్జవిచర్చితాయ ।
కృతస్మరాయై వికృతస్మరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 2

ఝణత్క్వణత్కఙ్కణనూపురాయై పాదాబ్జరాజత్ఫణినూపురాయ ।
హేమాఙ్గదాయై భుజగాఙ్గదాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 3

విశాలనీలోత్పలలోచనాయై వికాసిపఙ్కేరుహలోచనాయ ।
సమేక్షణాయై విషమేక్షణాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 4

మన్దారమాలాకలితాలకాయై కపాలమాలాఙ్కితలోచనాయ ।
దివ్యామ్బరాయై చ దిగమ్బరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 5

అమ్భోధరశ్యామలకున్తలాయై తటిత్ప్రభాతామ్రజటాధరాయ ।
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 6

ప్రపఞ్చసృష్ట్యున్ముఖలాస్యకాయై సమస్తసంహారకతాణ్డవాయ ।
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 7

ప్రదీప్తరత్నోజ్జ్వలకుణ్డలాయై స్ఫురన్మహాపన్నగభూషణాయ ।
శివాన్వితాయై చ శివాన్వితాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥ 8

ఏతత్పఠేదష్టకమిష్టదం యో భక్త్యా స మాన్యో భువి దీర్ఘజీవీ ।
ప్రాప్నోతి సౌభాగ్యమనన్తకాలం భూయాత్సదా చాస్య సమస్తసిద్ధిః ॥ 9

**ఇతి శ్రీమచ్ఛఙ్కరాచార్యవర్యవిరచితమ్**

**అర్ధనారీశ్వరస్తోత్రమ్**